
INTRODUCING
THE NEW BUBBALOO COOL MINT
Bubbaloo
Cool Mint
Bubbaloo
Cool Mint
BUBBLE GUM WITH LIQUID FRESHNESS

# ఈ సంచికలో...



చందమామ  సంపుటి: 63  జూలై 2010  సంచిక: 7

















**Editor, CHANDAMAMA INDIA LTD.,**
B-3, Cross Road 'B', MIDC,
Andheri (East), Mumbai-400093.



T

# వానలు... వానలు... మరిన్ని వానలు

దేశవ్యాప్తంగా సాధారణ రుతుపవనాల రాక కోసం మనం ఆశగా ఎదురుచూస్తున్నాము. ఈలోగా చందమామ పాఠకుల నుంచి నీటిని ఆదా చేయడం, నీటిని నిల్వచేయడంపై అసంఖ్యాక లేఖలు అందుకున్నాము.

వీటిలో కొన్ని అభిప్రాయాలు నిజంగానే సులువుగా అమలు చేసే విధంగా ఉన్నాయి. మీ స్వంత సాంకేతిక పద్ధతులతో నీటి ఆదా, నిల్వపై తీవ్రంగా ఆలోచించవలసిందిగా మేం పాఠకులను కోరుతున్నాం.

కొత్త విద్యాసంవత్సరం ప్రారంభమవుతోంది. కొత్త విద్యా సంవత్సరం అంటేనే పాత కొత్త మిత్రుల, పరిచయాల సమ్మేళనం కదా. ఈ సంవత్సరంలో మనం విద్యాపరంగా, ఇతర కార్యక్రమాల పరంగా కూడా పథకాలు రూపొందించుకోవాలి. మనకు మనంగా నిర్దిష్ట, ఆచరణీయమైన లక్ష్యాలను నిర్దేశించుకోవాలి.

ఉదాహరణకు, పరీక్షల స్కోరు విషయంలో 5 నుంచి 10 శాతం వరకు మెరుగుదల సాధించడం, కొత్త కళా రూపాన్ని, క్రీడలను వగైరా నేర్చుకోవడం వంటివి. మరి మీ పథకాలు ఏమిటో మాకు తెలుపండి. మీరు వాటిని ఎలా సాధించబోతున్నారు? మీ లక్ష్యసాధనలో మీకు వీలైనంత మేరకు మేము సహకరించగలం.

మా వార్షిక సంచిక పట్ల మంచి స్పందన వస్తోంది. మీ ప్రతికోసం ఆర్డర్ చేశారా? ఆర్ట్ బుక్ కూడా చక్కటి విజయాన్ని సాధిస్తోంది! ప్రతులు పూర్తిగా అమ్ముడు పోకముందే మీ కాపీని రిజర్వ్ చేసుకోండి!

రాబోయే నెలల్లో మీకోసం కొన్ని అద్భుత వార్తలు ఉన్నాయి. ఆసక్తిగా ఉందా? మీరు ఆత్రుతతో ఎదురుచూస్తున్నారని మాకు తెలుసు. తదుపరి సంపాదకీయంలో వాటి వివరాలకోసం ఓపిగ్గా ఇక్కడే ఎదురుచూడండి.

– సంపాదకుడు.




జూలై 2010 Rs. 20/-
*Founded by* B. Nagi Reddi and Chakrapani
**Editor & Publisher:** Prashant Mulekar
**Associate Editors:** Sowmya Rajendran, R. Vaasugi, K. Raja Sekhara Raju
**Content Head - Online:** Sowmya Bharadwaj
**Senior Artists:** K.C. Sivasankaran (Sankar), Gandhi Ayya, P. Mahesh
**Artist:** Venki
**Creative Designer:** Meghana Vaidyanathan
**Creative Writers:** S. Niveditha, R. Rama
**Layout Designer:** K. Narendra Raju
**Production In-charge:** Prashant Pawar
**Circulation:** e-mail: circulation@chandamama.com
**Head - Sales and Circulation:** Sanjay B Thorat
**Manager - Sales & Circulation:** AB Sairam
**Manager - Sales & Circulation (West & North):** Vinay K Brid
**Assistant Manager - Circulation:** Rajendra K Jadhav
**Asst. Manager - Sales & Circulation (East):** Subhankar Rej
**Sales Officer - Circulation:** K. Ravishankar
**Advertisement:** e-mail : sales@chandamama.com
**Subscription:** e-mail: Subscription@chandamama.com
Ramya K (Chennai)
Ph: +91 44 4399 2829
Jalpa Doshi (Mumbai)
Ph: +91 22 2831 2872/2831 1849
**Head Office : CHANDAMAMA INDIA LTD.,** B-3, Cross Road 'B', MIDC, Andheri (East), Mumbai-400093
Phone +91 22 28312872 / 28311849
email : chandamama@chandamama.com
Website : www.chandamama.com

Printed and Published by Prashant Mulekar at Shruti Art Pvt. Ltd., Unit No.1, Gupta Mills Estate, Devidayal Industrial Compound, Darukhana, Reay Road (East), Mumbai - 400 010 on behalf of Chandamama India Limited, B-3, Cross Road 'B', MIDC, Andheri (East), Mumbai-400093.
Editor : Prashant Mulekar

# పాఠకుల లేఖలు



పేరుకే బాలల పత్రిక గానీ, చందమామ పాఠకులలో వృద్ధతరం శాతమే ఎక్కువ. ముసిముసి నవ్వులతో పెద్దలు ఈ సంగతి ప్రకటిస్తూనే ఉంటారు. అత్యద్భుత వర్ణమిశ్రమంతో రూపొందిన ఏప్రిల్ సంచిక ముఖచిత్రం ఎన్నెన్నో తీపి గుర్తులను మోసుకొచ్చింది. మీగడ తరకల్లాంటి కాగితంమీద అచ్చు అక్షరాలూ, పంచ రంగులతోటి చిత్రీకరణ, చక్కటి కథలూ, వెంటతరిమే ధారావాహికలూ.. అదేం చిత్రమో కాని, చందమామలో వెలువడే వ్యాపార ప్రకటనలు కూడా విడువకుండా చదివింప జేస్తాయి. మొదటినుంచి ఇప్పటి వరకూ చందమామలో ఒకే తరహా జానపద కథలు వెలువడుతూ పాఠకులను ఒక అద్భుత, వాస్తవిక మహా ప్రపంచాల సమ్మేళనం నుంచి దూరం కాకుండా చేస్తున్నాయి.

తరతరాలుగా తన పాఠకులను ఆకర్షించడానికి సాహిత్యంలో సైతం చందమామ ఒక నిత్య మాయాబజారును సృష్టించింది. పంచతంత్రం, రామాయణం సరేసరి. ఇవి బాలలకు నిత్యపారాయణాలు.

చందమామ పాఠకులు జానపద కథల సమాహారాన్నే కోరుకుంటున్నారు. చందమామలో అనువాద కథలు కాక తెలుగు స్వయం కల్పిత కథలనే వేయండి.

– ఎంవీవీ సత్యనారాయణ, విశాఖపట్నం

చందమామ సంచిక ప్రతినెలా మొదటి వారంలోనే మార్కెట్‌లో విడుదలయ్యేలా చూడమని అభిప్రాయం పంపాను. నా అభిప్రాయంతో కూడిన మే నెల చందమామ మే చివరి వారంలో నా వద్దకు వచ్చింది. చూస్తూనే నవ్వు వచ్చింది. ఇంతకూ చందమామకు ఏమైంది? ఇంత ఆలస్యంగా పత్రిక రావడం ఏ విధంగానూ మంచిది కాదని సలహా.

– కె. గౌరీశంకర్, హైదరాబాద్

మీ అభిప్రాయాలను ఈమెయిల్
feedback@chandamama.com
ద్వారా పంపవచ్చు.



**Visit us at : http://telugu.chandamama.com**

**Avail the loyalty bonus!**

**Chandamama Subscribers will get flat 10% off on subscription renewals! (All Editions)**



**Chandamama!**

**Because stories make the world go round...**

**Choose your Chandamama!**

**Go to www.chandamama.com & subscribe Now!!**



**Chandamama is available in English and 12 regional languages. Junior Chandamama for children below 9 years is available only in English.**

I want to subscribe to / gift / renew subscription for the following editions of Chandamama:

☐ English ☐ Telugu ☐ Tamil ☐ Kannada ☐ Hindi
☐ Marathi ☐ Gujarati ☐ Oriya ☐ Bengali ☐ Sanskrit
☐ Santali ☐ Malayalam ☐ Assamese ☐ Junior

Name: ..........................................................................................

Date of Birth: .................................. Sex :.......................................

Address: .......................................................................................

.....................................................................................................

.....................................................................................................

.................................................... City: .........................................

State:......................................... Pin:...............................................

Telephone:.....................................................................................

Mobile:..........................................................................................

Email:............................................................................................

Subscription Number (for renewals):............................................

Gift Subscription to the following address:

.....................................................................................................

.....................................................................................................

.....................................................................................................

.....................................................................................................

Enclosed Cheque/DD* for Rupees...............................................

Cheque/DD No ..........................................................................

favouring Chandamama India Ltd on...........................................

..............................................................................................bank.

Please mail the subscription form to:
**Chandamama India Limited,**
B-3, Cross Road 'B',MIDC, Andheri (East), Mumbai-400093.
Phone +91 22 28312872 / 28311849
Email: subscription@chandamama.com
You can also subscribe online at: www.chandamama.com

| Take Your Pick! | 1 YEAR | 2 YEARS | 3 YEARS | 4 YEARS | 5 YEARS |
|---|---|---|---|---|---|
| ENGLISH (Rs. 25/- per copy) | Rs. 300 | Rs. 540 | Rs. 765 | Rs. 960 | Rs. 1125 |
| You Save | | Rs. 60 | Rs. 135 | Rs. 240 | Rs. 375 |
| REGIONAL (Rs. 20/- per copy) | Rs. 240 | Rs. 430 | Rs. 610 | Rs. 770 | Rs. 900 |
| You Save | | Rs. 50 | Rs. 110 | Rs. 190 | Rs. 300 |
| JUNIOR (Rs. 15/- per copy) | Rs. 180 | Rs. 325 | Rs. 460 | Rs. 575 | Rs. 675 |
| You Save | | Rs. 35 | Rs. 80 | Rs. 145 | Rs. 225 |

** conditions apply

**Annual Subscription Overseas :** US $40 for English Chandamama, US $30 for Regional Languages, US $25 for Junior Chandamama (including shipping and handling charges) by air mail.





# స్నేహం విలువ

కొలరాడోలోని ఓ కుగ్రామంలో సపనా అనే ఓ అమ్మాయి ఉండేది. ఈమె అరపాహో తెగకు చెందిన వ్యక్తి. తన వయసు అమ్మాయిల్లాగే ఈమె కూడా అడవికి వెళ్లి గింజలు ఏరుకునిరావడం, ఆటలాడటం, జింక చర్మంతో బట్టలు కుట్టడం వంటి పనులంటే బాగా ఇష్టపడేది. వీటితో పాటు సాయం సమయాల్లో రాబందులు, డేగలు ఎగురుతూంటే చూడడం అంటే ఆమెకు భలే సంతోషం.

"ఇవంటే నీకెందుకంత ఇష్టం సపనా?" ఆమె స్నేహితురాళ్లు అడిగేవారు. "ఈ పక్షులు మాంసం తిని బతుకుతాయి కదా!"

సపనా వారికేసి తీక్షణంగా చూసేది. "మరి మనం కూడా మాంసం తింటాము కదా, తిండీ బట్టలకోసం మనం జంతువులను వేటాడతాం అనేది కూడా!" కాని అమ్మాయిలకు ఆమెవైఖరి అర్థమయ్యేది కాదు. ఈ పక్షులకు తను చిన్న చిన్న మాంసం ముక్కలు పెడుతూంటే వారు భయపడేవారు. తలలు అడ్డంగా ఊపి అక్కణ్ణుంచి వెళ్లిపోయేవారు.

ఒకనాడు, గాయపడి నేలమీద పడి ఉన్న డేగను సపనా చూసింది. వెంటనే పరుగెత్తుకెళ్లి దాన్ని పరిశీలించింది. కింద పడిన డేగ కూడా సపనాను చూసి భయపడలేదు. ఎందుకంటే ఆమె అనేకసార్లు తనకు దయతో మాంసం ముక్కలు పెట్టింది మరి. డేగ రెక్కలో ఓ వాడి ముళ్లపంది ముల్లు లోతుగా గుచ్చుకుపోయి ఉండటం గమనించింది సపనా. ఆ ముల్లును మెల్లగా బయటకు లాగి గాయాన్ని మృదువుగా తడిమింది. తరవాత డేగ లేచి నిలబడి రెక్కలు విదిలించి, ఎగిరిపోయింది.

సపనా చుట్టూ చూసి ముళ్లపంది జాడ పసిగట్టింది. అది దగ్గిరలోనే ఉన్న ఓ పత్తిచెట్టు వద్ద పాకుతోంది. వెంటనే ఆమె స్నేహితురాళ్లను పిలిచింది. "హేయ్, రండే.. ముళ్లపందిని పట్టుకుందాం రండి, నూరు సంవత్సరాల పాటు మనం జింక చర్మాలతో తోలు దుస్తులు కుట్టుకోవడానికి సరిపడా ముళ్లు దీనివద్ద ఉన్నాయి రండే!"



ముళ్లపంది ఆమె అరుపులకు ఒక్కసారిగా చెట్టుమీదికి ఎక్కింది. సపనా దాని వెంటే చెట్టెక్కింది. ఆమె స్నేహితురాళ్లు చెట్టు దిగి రావలసిందని అరిచారు. అయితే చెట్లెక్కడంలో నేర్పరి అయిన సపనా చెట్టు

వెుదలుపైకి వెళ్లి ముళ్లపందిని వెంబడించింది.

''ఒంటినిండా సంచీడు ముళ్లు పెట్టుకున్న దానా, ఉండవే నిన్ను పట్టి తీరతాను,'' అంటూ సపనా కోపంతో అరిచింది. ఆమె చెట్టుపైకి ఎక్కేకొద్దీ స్నేహితురాళ్ల అరుపులు అంత దూరమైపోయాయి. సపనా తాను చెట్టు పైకి ఎక్కేశానని అను కుంటూనే ఉంది కాని చెట్టు మాత్రం పైపైకి పోతూనే ఉంది. ఎంతో ఎత్తుకు వెళ్లాక ఆమె కిందికి చూసింది.



''ఈచోటెక్కడిది?'' దూది లాంటి తెల్లని నేలను చూసిన సపనా ఆశ్చర్యపడింది. చెట్టు మీద నుంచి కిందికి జారిన ఆమె తన చుట్టూ తేరిపారచూసింది.

''ఓ, ఇది మేఘాల ప్రపంచం అన్నమాట. ఎక్కడ చూసినా తెల్లటి మేఘాలు తప్ప ఇక్కడ చూడ్డానికి ఏమున్నాయి. ఎంత విసుగ్గా ఉందో ఇక్కడ! ఏ కొంచెం కూడా భూమిలాగా లేదే.'' అంటూ సపనా గట్టిగా అన్నది.

''దీన్నే నువ్వు ఉపయోగించుకోవాలి మరి. ఇకపై జీవితాంతమూ నువ్వు ఇక్కడే నివసిం చబోతున్నావు!'' ఓ ముదుసలి ఆమెతో చెప్పాడు.

''ఇంతకూ నువ్వెవరూ?'' సపనా కోపంగా అరచింది. భూమ్మీదికి వెళ్లిపోవడానికి కాసింత దోవ ఏమన్నా ఉందేమోనని పరికించి చూసింది.

ముదుసలి వ్యక్తి తలలో రొట్టెలాంటి కొప్పు, దాంట్లో లోతుగా గుచ్చి ఉన్న మూడు మెరు స్తున్న ముళ్లపంది ముళ్లూ ఉన్నాయి.

''ఆగాగు, నువ్వు ముళ్లపందివి కదూ?'' సపనా ఆత్రంపట్టలేక అడిగింది. ''చాలా తెలివైనదానివే! కానీ ఇకపై తక్కువగా మాట్లాడు పిల్లా, నా సేవకురాలిగా నువ్వు చాలా పనులు చేయవలసి ఉంటుంది.'' అన్నాడు ముళ్లపంది మనిషి.

''నీకు నేను ఏ పనీ చేసి పెట్టను ఫో!'' అంది సపనా దృఢంగా.

''నిజంగానా?'' అన్న ఆ ముదుసలి వాడిగా ఉన్న ముళ్లను తీసుకుని బాణాల్లాగా వాటిని ఆమెవైపుకు విసిరాడు. అవి ఆమె చేతులకు తగులుకోగా బాధతో అరిచింది.

త్వరలోనే ఆ మనిషి మాట అతిక్రమించడం ఏమంత మంచిది కాదని సపనాకు అర్థమైంది. తరవాత అతడికి దున్నపోతు చర్మాలనుంచి తోలు దుస్తులను కుట్టడం, అతడికి వండి పెట్టడం ఆమెకు నిత్యకృత్యంగా మారింది.

ప్రతిరోజూ ఇలా కుట్టి కుట్టి ఆమె చేతు లకు పుండ్లు పట్టాయి. అంత కష్టపడి వాటిని కుట్టీ ఉపయోగం ఏమిటి? కుట్టిన సగం రోజులోపే ముళ్ల పంది మనిషి వాటిని చించి పారేసేవాడు. అతడికి బట్టలు కుట్టివ్వడం పనికిమాలిన పని అని ఒకసారి ఆమె చెప్పింది

కూడా. దాంతో అతగాడు ముల్లు తీసుకుని ఆమె చేతిని బలంగా తాకేలా విసిరాడు.

''అబ్బా!'' బాధతో ఏడ్చింది సపనా. తర్వాత తను అతడితో మాట్లాడటానికి సాహసించలేదు.

ఒకరోజు, ముదుసలికి వండిపెట్టడానికి సపనా నూల్‌కోల్ దుంపను నేలలోంచి లాగింది. ఓ పెద్ద దుంప వేరును పట్టుకుని పెళ్లగించడానికి ప్రయత్నిస్తే అది ఒక పట్టాన బయటకు రాలేదు. కోపంతో మండిపడ్డ సపనా తన శక్తి నంతా ప్రయోగించి లాగింది.

చివరకు, ఆ పెద్ద నూల్‌కోల్ దుంప ఆమె చేతుల్లోకి వచ్చేసింది. బలంగా లాగడంతో మేఘాల్లో పెద్ద గుంత ఏర్పడింది. దాంట్లోంచి చూసిన సపనా ఆనందం పట్టలేక అరిచింది. ఆ రంధ్రంలోంచి భూమి కనపడుతోంది మరి! ఆమె నూల్‌కోల్ దుంపను యథాస్థానంలో ఉంచింది. ఆమె ఉద్వేగంతో కొట్టుమిట్టాడింది. అప్పుడే తప్పించుకోవడానికి ఆమె మనస్సులో ఓ ఆలోచన రూపుదిద్దుకుంది.

సపనా జింకచర్మం నుంచి సన్నటి దారాలను లాగి వాటిని తాడులాగా పేనుతూ వచ్చింది. ప్రతిరోజూ తాడును పేనుతూ దాన్ని తన పరుపు కింద దాచి ఉంచసాగింది. కొన్నాళ్లకు ఇక ఆమె వేచి ఉండనవసరం లేకుండా పోయింది. ఆమె తాడును తీసుకుని ఒక రాయి చివరకు బలంగా కట్టి పెద్ద దుంప కింద ఉన్న రంధ్రంలోంచి జారసాగింది.

అలా ఆమె చాలా దూరం ఇబ్బంది లేకుండా జారుతూ వచ్చింది. అంతలోనే నూల్‌కోల్ దుంప రంధ్రంలోంచి ఆ వికృతమైన ముదుసలి ముఖం కనిపించడంతో ఆమె ఆశలు నీరై పోయాయి. ''నువ్వు నానుంచి తప్పించుకో లేవు,'' అంటూ అతడు తాడును పైకి లాగడం మొదలెట్టాడు. సపనా కళ్లలో నీళ్లు సుడులు తిరిగాయి. ''మళ్లీ నా బతుకు ముళ్లు, దుంపలు, తోలుదుస్తులు కుట్టడం బారిన పడబోతోంది దేవుడా!'' అనుకుంటూ బాధలో మునిగిపోయిందామె.

సరిగ్గా ఆ సమయంలోనే ఆమెకి కిందివైపున రెక్కల చప్పుడు వినిపించింది. అది ఎవరో కాదు. ఆమె పాత స్నేహితుడు డేగ. తన కాళ్ల కింది భాగంలో అది నిలిచింది. సపనా కళ్లు గట్టిగా మూసుకుని రాబందు మీదికి దూకి దాన్ని హత్తుకుంది. ఓ గుడ్లగూబ, డేగ జాతిపక్షి కూడా ఆమెకు సమీపంలో ఎగురుతూ, పై నుంచి ముళ్లపంది ముదుసలి విసురుతున్న ముళ్లనుంచి ఆమెను కాపాడుతూ వచ్చాయి.



త్వరలోనే సపనా కాళ్లు నేలను తాకాయి. ఆమె ఇంటికి పరుగెత్తుకుంటూ వెళ్లింది. ఆమె కథను విన్న జనం, అప్పటినుంచి వేటాడే పక్షులను గౌరవించసాగారు. నాటి నుండి జనం తాము తింటున్న దాంట్లోంచి కొన్ని మాంసం ముక్కలు తీసిపెట్టి వాటికి అందించేవారు. – రమారమేష్

బేతాళ కథలు

# కళాభిమానం

పట్టువదలని విక్రమార్కుడు చెట్టువద్దకు తిరిగివెళ్ళి, చెట్టు పైనుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానంకేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, ''రాజా, ప్రతి ఒక్కసారీ నీ ప్రయత్నంలో భంగపడు తున్నా సడలని నీ పట్టుదలా, ఓర్పూ నన్ను ఆశ్చర్య పరుస్తున్నవి. ఎన్నోశ్రమలకు ఓర్చి నీవు చేస్తున్న ప్రయత్నం చివరి క్షణంలో విఫలమయ్యే అవకాశం కూడా ఉంది. అలవి గాని పని చేయకపోవడమే ఉత్తమమను కుంటాను. చేతిలో అద్భుతమైన కళను ఉంచుకుని కూడా వెనకటికి ముకుందు డనేవాడు కోరివస్తున్న ఫలాలను కాదనుకుని ఉన్నపాటుగా రాజానుగ్రహాన్ని కూడా కాల దన్ని దూరప్రాంతాలకు వెళ్ళిపోయిన కథ చెబుతాను. శ్రమ తెలియకుండా విను,'' అంటూ ఇలా చెప్పసాగాడు.

అంగరాజ్యంలో ఒక గ్రామంలో ముకుం దుడనేవాడు తన భార్యా బిడ్డలతో కలిసి



జీవిస్తూండేవాడు. తండ్రి తనకు వారసత్వంగా ఇచ్చిన పొలం దున్నుకుంటూ వచ్చిన పంటతో తన కుటుంబాన్ని పోషించుకుంటూ ఉండే వాడు. వ్యవసాయ పనులు సంవత్సరం పొడ వునా ఉండవు కాబట్టి తన తీరిక వేళల్లో బొమ్మలు చెక్కేవాడు. క్రమంగా శిలలపై శిల్పాలు చెక్కడంలో ముకుందుడు నేర్పు సాధించాడు.

ఒకనాడు ముకుందుడి భార్య, ''దేవతల బొమ్మలు చెక్కడమేనా, నా బొమ్మ చెక్కడమే మన్నా ఉందా,'' అన్నది.

ముకుందుడు నవ్వి, ఆమెను తన ఎదుట కూర్చుండబెట్టుకుని శిల్పం చెక్కడం ప్రారంభించాడు. మొదలు పెట్టినెలరోజులైనప్పటికీ, శిల్పం ఒక క్రమ రూపంలోకి రాలేదు. రోజు మొత్తంలో ఎక్కువ భాగం తన భర్త ఎదుట కదలకుండా కూర్చోవడంతో ముకుందుడి భార్య విసుగెత్తిపోయింది.

''శిల్పం చెక్కడం అంటే మరీ ఇంత కష్టమా?'' అందామె.

ముకుందుడు తన చేతిలోని సుత్తినీ, ఉలినీ, ఒక పక్కన పెట్టి, ''కష్టం కాదా, నీ రూపం చూస్తూ, నీ పోలికలు ఈ రాతిలో మలచాలంటే చాలా సమయం పడుతుంది. దేవతల విగ్రహాలైతే వాటిని ఏరకంగా తీర్చి దిద్దినప్పటికీ ప్రజలు వాటిని సులభంగా గుర్తుపడతారు.'' అన్నాడు.

అప్పటికి వర్షాకాలం ప్రారంభమై వ్యవసాయ పనులు మొదలు పెట్టే సమయమయ్యింది. పగలు సేద్యం పనులు చేసుకుంటూ, తీరిక వేళలో తన భార్య విగ్రహం చెక్కడం ప్రారంభించాడు ముకుందుడు.

ఒకనాడు ఓ మునీశ్వరుడు ఆ దారిన పోతూ పొలం పక్కనే ఉన్న చెరువులోకి జారిపడిపోయాడు. ప్రాణభయంతో ఆయన పొలికేకలు పెట్టాడు. ముకుందుడు తన చేతిలోని పనిని మొదలు పెట్టి పరుగెత్తుకు వెళ్ళి, చెరువులో మునిగిపోతున్న మునీశ్వరుడిని రక్షించాడు. ముకుందుడు తయారు చేస్తున్న శిల్పాన్ని చూసి ముని సంతోషపడి ''నువ్వు నా ప్రాణాలు కాపాడినందుకు ప్రతిఫలంగా నీకు వరం ప్రసాదిస్తాను. నువ్వు అతివేగంగా శిల్పం రూపొందించేటట్టూ, నువ్వు చెక్కే ప్రతి శిల్పం లోనూ, ఆయా వ్యక్తుల మానసిక భావాలు స్పష్టంగా వ్యక్తమయ్యేటట్టూ వరం ఇస్తున్నాను. నేనిచ్చే వరం నీజీవితాన్ని సంతోషమయం చేస్తుంది.'' అన్నాడు.

ముకుందుడు ఆ ముని మాటలను అంతగా లెక్క చెయ్యలేదు. వరం యిచ్చే శక్తి

ఆయనకు ఉన్నప్పుడు ఆయన తన ప్రాణాలను మాత్రం ఎందుకు కాపాడుకోలేక పోయినట్టు?

ముని అతడి ఆలోచనలు గ్రహించిన సూచనగా నవ్వుకుంటూ తన దారిన వెళ్ళి పోయాడు. అదేం విచిత్రమో గాని ఆ రాత్రికి రాత్రే ముకుందుడు తన భార్య విగ్రహాన్ని సమర్థవంతంగా తీర్చిదిద్దాడు. ఆ శిల్పం మొహంలో ప్రేమానురాగాలు స్పష్టంగా వ్యక్త మవుతున్నాయి.

ముకుందుడి భార్య ఎంతగా మురిసి పోయిందంటే ఆమె ప్రదర్శించిన తన్మయత్వం వల్ల గ్రామమంతా శిల్పం సంగతి తెలిసిపో యింది.

గ్రామంలో ఉండే ప్రతి ఒక్కరూ తమ తమ విగ్రహాలు తయారు చేసి పెట్టమని ముకుం దుడిని కోరుతూ వచ్చారు.

ఇలా ఉండగా ముకుందుడి పిల్లలు ఇద్దరూ కలిసి తమ విగ్రహాలు కూడా తయారు చేయమని మారాం చేయసాగారు. వారిలో ఒకరికి పదేళ్లూ, మరొకరికి ఏడేళ్లూ. దీంతో శిల్పి తప్పనిసరై తన పిల్లల విగ్రహాలను ముద్దులు మూటగట్టే ప్రాణులు నిలబడినంత సహ జంగా తీర్చిదిద్దాడు ముకుందుడు. అవి కూడా ఒక రాత్రిలోనే పూర్తయ్యాయి. భార్యా భర్తలు తమ బిడ్డల విగ్రహాలను తనివితీరా చూసుకుంటూంటే గ్రామ పెద్ద వాళ్లముందు ప్రత్యక్షమయ్యాడు.

''నీకెంత డబ్బు కావాలో తీసుకుని నా విగ్రహాన్ని వీలైనంత త్వరగా రూపొందించు. అలా చెయ్యకపోతే ఏం జరుగుతుందో నీకు వేరేగా చెప్పనక్కరలేదు కదా,'' అన్నాడు.

ఆ గ్రామపెద్ద అతి దుర్మార్గుడని పేరు తెచ్చుకున్న పెద్దమనిషి. నలభై సంవత్సరాల





వయస్సులోనే అతడు ఊరి ప్రజల పట్ల చాలా క్రూరంగా వ్యవహరించాడని పేరు పడింది. అలాంటి వాడి శిల్పాన్ని చెక్కితే ఒక తంటా ఉంది. అతడి కుటిలమైన భావనలు శిల్పం మొహంలో ప్రతిఫలిస్తాయి. ముని తనకిచ్చిన వరం తనపట్ల రుజువు కావడం ముకుందుడు స్వానుభవంలో గ్రహించాడు.

శిల్పం చెక్కకపోయినా తంటాయే కదా! అతడు తననూ తన కుటుంబాన్ని హింసించవచ్చు. తన విద్య ఈ రకంగా తనకి ప్రమాద కారణం కావడం అతడికి మతి పోగొట్టింది. కేవలం ఒక్క రాత్రిలోనే గ్రామపెద్ద శిల్పాన్ని చెక్కకుండా వారంరోజులపాటు ఆ పని పొడిగిస్తూ వచ్చాడు ముకుందుడు.

గ్రామ పెద్ద చూసి చూసి ఓ రోజు అతడిపై విరుచుకుపడుతూ, "శిల్పంలో నా మొహం ఎలా ఉంటుందో చూసుకోవాలని ఎంతో ఆతృతగా ఎదురు చూస్తున్నాను. అలాంటిది రోజుల తరబడి నా శిల్పం చెక్కడంలో నీ ఉద్దేశ్యమేమిటి?" అని అడిగాడు. ముకుందుడు దీంతో గ్రామపెద్ద వాస్తవ రూపాన్ని చెక్కడంలో తన ఇబ్బందిని చెప్పుకొనక తప్పలేదు.

"నువ్వు చెప్పే కాకమ్మ కథలు నమ్మడానికి సిద్ధంగా లేను. నువ్వు ఎలాంటి భావాలతో శిల్పం తయారు చెయ్యదలచుకున్నావో అలాంటి భావాలే శిల్పం మొహంలో ప్రత్యక్షమవుతాయి. తప్ప నా మనస్సు నీ రాతిలో ప్రతిఫలించదు." అన్నాడు గ్రామపెద్ద.

అతడికేం చెప్పి నమ్మించాలో ముకుందుడికి తోచలేదు. చివరికి అతడి శిల్పం తీర్చిదిద్దాడు. ముకుందుడు చెప్పినట్లే గ్రామపెద్ద మొహంలో క్రూరత్వం ప్రత్యక్షమయింది.

గ్రామపెద్ద అతడినీ, అతడి కుటుంబాన్నీ ఏం చెయ్యబోయేవాడో కాని, రాజభటులు అతడి కోసం ప్రత్యేకంగా రథం తీసుకుని వచ్చారు.

ముకుందుడు, అతడి కుటుంబంతో పాటుగా గ్రామపెద్ద కూడా నిర్ఘాంతపోయాడు. అప్పటికప్పుడే ముకుందుడి కుటుంబం రాజధానీ నగరం బయల్దేరింది. అంగరాజ్యపు రాజు తన రాజ్యమంతటా తన శిలావిగ్రహాలు ప్రతిష్ఠింపచేస్తూ, ఆ పనిలో భాగంగా దేశంలోని శిల్పులందరినీ తన వద్దకు రప్పించుకున్నాడు.

తన మనస్సులోని ఉద్దేశ్యాన్ని రాజు వాళ్లందరికీ విడమర్చి చెప్పాడు.

"నన్ను చూసినా, నా విగ్రహాన్ని చూసినా ప్రజలు భయంతో వణికిపోవాలి. నా రాజ్యంలో ఎలాంటి నేరాలూ జరగడానికి వీలులేదు.

అందువల్ల మీ శక్తికొద్దీ విగ్రహాలు తయారు చెయ్యండి.'' అన్నాడు రాజు. ముకుందుడి గుండెల్లో మరోసారి రాయిపడింది.

రాజుగారి శిల్పాలు మిగతా వారి చేతుల్లో తయారై అతి సహజంగా రూపుదిద్దుకోవచ్చు. ముకుందుడి చేతిలో రాజు శిల్పాలు ఆయన లోపలి భావనలను ప్రతిబింబిస్తే ఆయన మొహం కోపంగా, అధికార దురహంకారంగా రూపుదిద్దుకుంటేనే ప్రమాదం.

రాజుగారు ప్రతి శిల్పికీ ఒక ఇల్లు ఏర్పాటు చేశారు. మొదటి ప్రయత్నంగా ముకుందుడు ఒక రాత్రి వేళలో తన ఇంటి పెరట్లో రహస్యంగా శిలను ఏర్పాటు చేసుకుని, రాజుగారి శిల్పం చెక్కాడు.

రాజుగారి చిత్రపటాన్ని తన ఎదుట ఉంచుకుని అతడు ఈ పని ముగించాడు. రాజుగారి మొహం ఆహ్లాదంగా, ఎంతో కరుణ రసాత్మకంగా తయారయ్యింది. చిత్రపటంలో కంటే శిల్పంలో రాజు మొహం ఎంతో దయా స్వభావంతో కనిపించింది. తరవాత ముకుందుడు సంతృప్తిగా నిద్రపోయాడు.

ముకుందుడి ఇంటిమీద నిఘా ఉంచిన గూఢచారులు ఆ రాత్రికి రాత్రే అతడు శిల్పాన్ని తయారు చేసిన సంగతి రాజు గారికి చెప్పారు.

రాజు విపరీతంగా ఆశ్చర్యపోయాడు. రాత్రికి రాత్రే శిల్పం తయారు చెయ్యడమా, అనుకుంటూ ఆయనే స్వయంగా ముకుందుడి ఇంటికి వచ్చి తన శిల్పాన్ని కళ్లారా చూసుకున్నాడు. ఆనందభరితుడయ్యాడు. దాంతో తన రాజ్యంలో ప్రతిష్ఠించాలనుకున్న శిల్పాల



బాధ్యత మొత్తంగా ముకుందుడికే ఒప్పచెప్పి అతడిని తన ఆస్థానంలో ప్రముఖ పదవిలో నియమించాడు.

రాజభోగాలతో ముకుందుడి కుటుంబం ఉబ్బితబ్బిబ్బయిపోయింది. ఎక్కడక్కడ పనివారూ, కాలు కింద పెట్టకుండా వాహనాలూ.. దీంతో అతడి కుటుంబం విలాసవంతమైన జీవితానికి అలవాటు పడేలా పరిస్థితి మారిపోయింది.

ఒకనాడు మహారాణి తన అంతఃపురానికి ముకుందుడి కుటుంబాన్ని రప్పించుకుంది. ఒకపూట అంతా ఆమెతో ముకుందుడి భార్య, పిల్లలూ గడిపారు. ఆమె వద్దనించి బయట పడిన తర్వాత ముకుందుడి భార్యకు ఊపిరి సలిపినట్లయింది.

ఇంటికి వచ్చిన తర్వాత భర్తతో, ''రాణి వాసం అంటే అంత కత్తిమీద సాము అనుకోలేదు. బంధుమిత్రులు, పనివాళ్లు, అందరూ

రాణిని చూసి వణికిపోతున్నారు. ఆమె ఎప్పుడేం తింటారో, ఏం తాగుతారో, ఏం కోరికలు కోరతారో, ఎవ్వరికీ అర్థం కాదట. మా ఎదుటనే పనివాళ్లకు కొరడా దెబ్బలు తగిలాయి.'' అన్నది.

ముకుందుడు నొచ్చుకున్నాడు. అంతఃపురానికి వెళ్ళి వచ్చాక తన భార్యా బిడ్డలు అస్వస్థతకు గురయ్యారు. రాణి అటుతర్వాత ముకుందుడిని తన వద్దకు పిలిపించుకుంది. తనవీ, తన బిడ్డవీ శిలావిగ్రహాలు తయారు చెయ్యవలసిందిగా రాణి అతడిని ఆజ్ఞాపించింది.

ముకుందుడికి మూడోసారి తన గుండెలో రాయిపడింది.

ఆరాత్రే అతడు రాజభోగాలు వదిలిపెట్టి, మూడోకంటికి తెలియకుండా రాజ్యం విడిచిపెట్టి, తన కుటుంబంతో సహా దూరప్రాంతాలకు బయలుదేరిపోయాడు.

బేతాళుడు ఈ కథ చెప్పి, ''రాజా, సుఖభోగాల మధ్య పడి ముకుందుడు తన శిల్పకళను మరచిపోయి ఉంటాడు. లేకపోతే రాణీగారి విగ్రహాన్ని ప్రయోగాత్మకంగా నైనా రహస్యంగా రూపొందించి ఉండేవాడు. రాణి ముఖకవళికలు కోపావేశాలతో రూపొందగలవనే విషయం నిరూపణ కాకముందే దేశం నుండి పారిపోయాడు. తన తప్పులేకుండానే సుఖభోగాలు వదులుకుని తన కుటుంబాన్ని కూడా తిరిగి పేదరికంలోకినెట్టాడు. అతడిలా ప్రవర్తించడానికి వేరే కారణం ఉందేమో నీకు తెలిసి కూడా చెప్పకపోయావో నీ శిరస్సు వెయ్యి ముక్కలవుతుంది.'' అన్నాడు.

విక్రమార్కుడు సమాధానంగా, ''ముకుందుడెప్పుడూ తన కళను ఆదాయం సంపాదించే మార్గంగా పరిగణించలేదు. రాజభోగాలు వాటంటతటవే అతడిని వరించాయి. ముని ఇచ్చిన వరంతో కూడా అతడు తృప్తి చెందకుండా తన చేతిలో ఉన్న విద్యను ఎంత మేరకు న్యాయం చేయగలను అని మాత్రమే ఆలోచించుకునేవాడు. తన కళను అహంకార ప్రదర్శనకు అతడు వాడుకోలేదు. ఈ కారణంగానే రాణి విగ్రహాలు చెక్కే పని నుండి అతడు దూరంగా వెళ్లిపోయాడు.'' అన్నాడు.

రాజుకు ఈవిధంగా మౌనభంగం కలగగానే బేతాళుడు శవంతో సహా మాయమై తిరిగి చెట్టెక్కాడు.

– ఎంవీవీ సత్యనారాయణ






సలూంకి మంత్రప్రభావంతో ప్రభాత్ కవల ఆత్మ–థార్విక్– ను సృష్టించాడు. థార్విక్ ఇప్పుడు సలూంకి పుత్రుడుగా ఉన్నాడు కాబట్టి, సలూంకి నుంచి అతడు మాణిక్యాన్ని పొందగలడు. ప్రభాత్ మారాడని ధర్మపిత గుర్తించగానే, అతడిని ఆర్యవద్దకు పంపించాలని నిర్ణయించాడు.

మీరు నన్ను ఎందుకు ఎంపిక చేశారు?

మనం థార్విక్ నుంచి పిల్లలను కాపాడాలి.

మీరేం చేయాలని అతడు అనుకుంటు న్నాడు?

నేను మరిఘాను చంపేయాలని అతడు కోరుకుంటు న్నాడు.

లేకుంటే అతడు పిల్లలను చంపేస్తాడు.

మరి, మీరేం చేయబోతు న్నారు?

దేవుని ప్రార్థించబో తున్నా.


థార్విక్ పరిశీలిస్తున్నట్లయితే, నేను దాక్కోనవద్దా?
నీవిక్కడ ఉన్నట్లు అతడికి తెలుసు. మరిఘాను చంపడానికి నాకు సాయం చేయాలని అతడు ఆశిస్తున్నాడు.

కాని, అతడెందుకలా ఆలోచిస్తున్నాడు.
అంటే దీనర్థం...
మరిఘా బొంతకాకి రాణి కలలోకి వచ్చింది.
నేను ఈరోజు వంపాల్సిందున్నమాట. మరొక వ్యక్తిపుత్రుడిని..
అన్ని పాపాలూ నిప్పులమైనవే మరిఘా.
పదాలు... పదాలు... ఖనే...


అతడు ఇక్కడెందుకున్నాడు?
నాకు సాయపడేందుకు...
ఇదేమిటి తండ్రీ? నీవు స్థానాలు మార్చావా?
మన అదృష్టరేఖ స్థానాలు మార్చుకుంది చిన్నారీ.
తండ్రీ నువ్వు అలా చేయకూడదు.


నువ్వు ఈ స్థలాన్ని ప్రాణాలతో వదిలి వెళ్లలేవు మరిఘా.


నీ కళ్లు మూసుకో. అంధకారం అలుముకో నువ్వు.
నీకెంత ధైర్యం? నీకింత సాహసమా? నీ జిత్తులతో నన్ను ఏమార్చగలనని నీవనుకుంటున్నావా?


ధైర్యవంతురాలు మరిఘా ఇక్కడుంది. పిల్లలను తిరిగి ఇచ్చేయి, థార్విక్.
(ఇంకా ఉంది)



# రామాయణం



రాముడు శంబూకుణ్ణి చంపి, అయోధ్యకు తిరిగి వస్తూనే, ద్వారపాలకుడితో భరత లక్ష్మ ణులను తన వద్దకు పంపమని చెప్పాడు. తన వద్దకు వచ్చిన వారితో రాముడు, "తమ్ముళ్లూ, అన్ని పాపాలనూ పోగొట్టే రాజసూయం చేద్దామనుకుంటున్నాను. పూర్వం మిత్రుడూ, చంద్రుడూ రాజసూయం చేసే శాశ్వతమైన కీర్తి గడించారు. అందుకు మీ సలహా ఏమిటి?" అని అడిగాడు. దానికి భరతుడు, "అన్నా, నీ ధర్మానికీ, కీర్తికీ లోటేమున్నది? రాజసూయం చేశావంటే అనేక రాజవంశాలు నాశనమవు తాయి. పౌరుషం కొద్దీ అనేకమంది రాజులు నశిస్తారు. అందుచేత రాజసూయం చేసి భూమికి లేనిపోని సంక్షోభం కలిగించవద్దు," అన్నాడు. భరతుడన్న మాట రాముడికి నచ్చింది. మంచి సలహా ఇచ్చి నందుకు అతడు భరతుణ్ణి మెచ్చుకున్నాడు.

అప్పుడు లక్ష్మణుడిలా అన్నాడు. "అన్నా, సమస్త పాపాలనూ పోగొట్టే మహాయజ్ఞం అశ్వమేధం, వెనక ఇంద్రుడు తనకు మహా పాతకం చుట్టుకోగా, అశ్వమేధ యాగం ద్వారా ఆ పాపాన్ని పోగొట్టుకున్నాడు."

లక్ష్మణుడా వృత్తాంతాన్ని ఈ విధంగా చెప్పాడు: పూర్వం వృత్రుడనే గొప్ప రాక్షసుడు ఉండేవాడు. అతను మహాధర్మపరుడు, గొప్ప జ్ఞాని, మూడులోకాలనూ ఎంతో ప్రేమగా చూసుకుంటూ, ధర్మం తప్పకుండా పాలిం చాడు. అతని పాలనలో భూమి అన్ని కోరిక




లనూ తీర్చేది. దున్నకుండానేపండేది, పూలూ పళ్లూ, కాయలూ రసవంతంగా ఉండేవి.

ఈలోగా తపస్సు చేయాలని సంకల్పం కలిగిన వృత్రుడు తన పెద్దకొడుక్కు రాజ్యం అప్పగించి ఉగ్రతపస్సు ప్రారంభించాడు. అది చూసి దేవేంద్రుడు బెదిరిపోయి, విష్ణు మూర్తి వద్దకు వెళ్లి ''వృత్రుడు అదివరకే మూడు లోకాలనూ జయించాడు. ఇప్పుడు తపస్సు కూడా ప్రారంభించాడు. అది పూర్తి అయిందంటే లోకాలుండేటంత కాలమూ అతన్ని నేను జయించలేను. అందుచేత నువ్వు ఆ వృత్రుణ్ణి కడతేర్చితే గాని నాకు, దేవతలకూ దిక్కులేదు,'' అన్నాడు.

దేవతల పక్షాన ఇంద్రుడిలా మొరపెట్టు కోగా, విష్ణుమూర్తి, ''మహాత్ముడైన వృత్రుడు నాకు స్నేహితుడు అందుచేత నేను అతణ్ణి చంపను. అయితే నీ కోరిక కూడా తీసివెయ్య డానికి లేదు. అందుకని వృత్రుడు చచ్చే ఉపాయం ఒకటి చేస్తాను. నా శక్తిని మూడు భాగాలు చేసి, ఒక భాగం నీలోనూ, ఒకటి వజ్రాయుధంలోనూ, మూడవదాన్ని భూమి లోనూ ప్రవేశపెడతాను. అప్పుడు నువ్వు వృత్రుణ్ణి చంపగలుగుతావు,'' అన్నాడు.

ఈ మాటలు విని ఇంద్రుడూ, దేవతలూ సంతోషించి, వృత్రుడు తపస్సు చేసుకునే వనానికి వెళ్లారు. తపశ్శక్తి చేత మూడు లోకాలనూ దహించేటట్టుగా వెలిగిపోతూ వృత్రుడు వారికి కనిపించాడు. ఇంద్రుడు తన వజ్రాయుధాన్ని రెండు చేతులా పట్టి వృత్రుడి తలను తెగవేశాడు. ఆ వెంటనే బ్రహ్మహత్య ఇంద్రుడి శరీరాన్ని చుట్టుకున్నది. అతనికి తీరని దుఃఖం పుట్టుకొచ్చింది. అప్పుడు దేవ తలు విష్ణువుతో, ''దేవా, నువ్వేమో వృత్రుణ్ణి చంపావు. బ్రహ్మహత్య ఇంద్రుణ్ణి చుట్టుకు న్నది. అది వదిలే ఉపాయం చెప్పు,'' అని మొరపెట్టుకున్నారు.

''ఇంద్రుడు అశ్వమేధం చేసినట్టయితే బ్రహ్మహత్య తొలగిపోయి అతడు ఎప్పటి దేవేంద్రుడవుతాడు,'' అని విష్ణుమూర్తి దేవత లకు చెప్పాడు. ఈ సలహా విని దేవతలు బృహస్పతి మొదలైన మునులను వెంట బెట్టుకుని ఇంద్రుడున్న చోటికి వెళ్లారు. ఇంద్రుడు తెలివి పూర్తిగా పోయి, భయ భ్రాంతుడై ఒక చోట పడి ఉన్నాడు. ఆ ఇంద్రుణ్ణి వెంట ఉంచుకుని దేవతలు అశ్వ మేధయాగం చేసిన మీదట, అతణ్ణి బ్రహ్మహ త్య వదలిపోయింది. లక్ష్మణుడీ కథ చెప్పిన మీదట రాముడు అశ్వమేధం యొక్క మహి మను తెలిపే మరొక కథ చెప్పాడు. పూర్వం



కర్దమప్రజాపతి కొడుకు ఇలుడు బాహ్లిక దేశాన్ని పరిపాలించేవాడు. అతనంటే దేవతలకూ, రాక్షసులకూ, నాగులకూ, యక్షులకూ, గంధర్వులకూ, ఎంతో గౌరవం ఉండేది.

ఒక చైత్రమాసంలో ఇలమహారాజు తన పరివారాన్ని వెంటబెట్టుకుని అడవికి వేటకు వెళ్ళాడు. ఎన్ని వేల మృగాలను చంపినా అతనికి వేటతమకం తీరలేదు. అందుచేత అతడు వేటాడుతూ పోయిపోయి, కుమార స్వామి పుట్టిన చోటికి వెళ్ళాడు. అక్కడ పార్వతి పరమేశ్వరులూ, వాళ్ళఅనుచరులూ ఉన్నారు.

ఆ పర్వత ప్రదేశంలో గల విశేషమేమిటంటే, అక్కడ చెట్లూ, పక్షులూ, జంతువులూ కూడా ఆడవే.అక్కడికి చేరుతూనే, ఇలుడూ, అతని భృత్యులూ కూడా స్త్రీలుగా మారిపోయారు. తనలో కలిగిన మార్పు చూసి ఇలుడికి బాధా, భయమూ పుట్టాయి. అతను శివుడి దగ్గిరకు వెళ్ళి, స్తోత్రం చేసి, కాళ్ళపైన పడి రక్షించమన్నాడు. ''నీ ఆడతనం పోగొట్టడం తప్ప ఇంకేమైనా కోరుకో,'' అన్నాడు శివుడు. ఇలుడు శివుణ్ణి మరొక వరమేదీ కోరక, పార్వతిని ప్రార్థించాడు. పార్వతి అతనిపై జాలిపడి, అతను ఒకనెల స్త్రీగానూ, మరొకనెల పురుషుడుగానూ ఉండేటట్టూ, స్త్రీగా ఉండేటప్పుడు జరిగేది పురుషుడిగా ఉండేటప్పుడు జ్ఞాపకం లేకుండానూ వరమిచ్చింది.

ఇలుడు కాస్తా ఇలగా మారింది. అతని సైనికులందరూ స్త్రీలే అయారు. వారందరూ యథేచ్ఛగా ఆ అడవిలో తిరగసాగారు. వాళ్ళు స్త్రీలుగా మారిన కొండకు సమీపంలోనే ఒక సరస్సున్నది. అక్కడనే చంద్రుడి కొడుకైన బుధుడు ఆశ్రమం ఏర్పర్చుకుని, తపస్సు చేసుకుంటున్నాడు. అతను మంచి యౌవనంలో ఉండి, ఆకర్షణీయంగా ఉన్నాడు.

ఇలా, ఆమె వెంట ఉన్న స్త్రీలూ సరస్సులో దిగి, దాన్ని కల్లోలం చెయ్యసాగారు. బుధుడు వారిని చూసి, ఇల సౌందర్యం చేత సమ్మోహితుడయాడు. అంత అందమైన స్త్రీ మూడు లోకాలలోనూ మరొకతె ఉండదని అతనికి తోచింది. ఇల వెంట ఉన్న స్త్రీలను కొందరిని అతను ఆశ్రమంలోకి పిలిచి, ''ఆమె ఎవరు? ఈ ప్రాంతానికి ఏం పనిమీద వచ్చింది? నిజం చెప్పండి.'' అన్నాడు.

''అయ్యా, ఆమె మాకు నాయకురాలు. ఆమెకు భర్త లేడు. మమ్మల్ని వెంటబెట్టుకుని ఇలా అరణ్యమంతా తిరుగుతున్నది.'' అన్నారా స్త్రీలు. ''మీరంతా ఈ ఆశ్రమంలోనే కందమూలాలు తింటూ ఉండిపోండి. ఇక్కడ ఉండే కింపురుషులు మీకు భర్తలౌతారు.''



అని బుధుడు వారితో అన్నాడు. వాళ్లందరూ వెళ్లిపోయారు. తరవాత బుధుడు "నేను చంద్రుడి కొడుకును. నా పేరు బుధుడు. నన్ను భక్తి స్నేహాలతో చూసుకుంటూ ఇక్కడే ఉండిపో," అన్నాడు.

"నీ ఇష్టం," అన్నది ఇల. ఇద్దరూ మహా సంతోషంగా ఆ నెల గడిపారు. ఒకనాడు ఉదయం ఇల కాస్తా, ఇల మహారాజులా మారాడు. జరిగిన దేదీ జ్ఞాపకం లేదు. సరస్సులో బుధుడు చేతులు పైకెత్తి తపస్సు చేసుకుంటున్నాడు. ఇలుడతన్ని చూసి, "అయ్యా, నా సైనికులతో ఈ పర్వత ప్రాంతానికి వేటకై వచ్చాను. వారంతా ఎటు పోయారో తెలియకుండా ఉన్నది," అన్నాడు.

"రాజా, రాళ్లవాన కురిసి, నీ పరివారమంతా నశించింది. నువు మాత్రం ఈ ఆశ్రమంలో తలదాచుకున్నావు. విచారించకు. ఇక్కడ నువు సుఖంగా ఉండవచ్చు," అన్నాడు బుధుడు. ఇలుడు తన అనుచరులు పోయినందుకు దిగులుపడుతూ, "నాకింక రాజ్యం ఏలాలని లేదు. మీరనుమతిస్తే నా పెద్దకొడుకు శశిబిందుడికి పట్టం గట్టి, వెంటనే తిరిగి వస్తాను," అన్నాడు. "ఇలమహారాజా, ఒక్క సంవత్సరం ఇక్కడ ఉండు. నీకు మేలు కలిగేటట్టు చేస్తాను," అన్నాడు బుధుడు. ఇలుడు సరేనన్నాడు. ఒక నెలపాటు స్త్రీగా ఉండి మరొకనెలపాటు పురుషుడుగా ఉంటూ ఇలుడు తాను స్త్రీగా ఉన్న సమయంలో బుధుడికి ఒక కొడుకును కన్నాడు.

అటు తరవాత బుధుడు సంవర్తుణ్ణీ, చ్యవనుణ్ణీ, ప్రమోచనుణ్ణీ, దుర్వాసుడు మొదలుగా గల ఇతర రుషులునూ పిలిపించి, వారికి ఇలుణ్ణి పరిచయం చేసి, అతని పరిస్థితి యధాప్రకారం అయేటందుకు ఏమైనా దారి చెప్పమన్నాడు. ఈ సమయంలోనే ఇలుడి తండ్రి అయిన కర్దముడూ, మరి కొందరు రుషులూ కూడా అక్కడికి వచ్చారు. అందరూ ఇలుడికి తలా ఒక సలహా ఇచ్చారు. కాని కర్దముడు, తన కొడుక్కు మేలు కలగాలంటే, అశ్వమేధయాగం చెయ్యటమే మార్గమన్నాడు. ఆయన సలహా ప్రకారం అందరూ చేరి అశ్వమేధయాగం చేసి, ఇలమహారాజుకు స్త్రీత్వం లేకుండా చేశారు. యజ్ఞం పూర్తి అయే సమయానికి శివుడే ప్రత్యక్షమై ఇల మహారాజును అనుగ్రహించాడు. తరవాత ఇలుడు బాహ్లిక దేశానికి తిరిగి వెళ్లక, మధ్యదేశంలోని ప్రతిష్ఠానపురాన్ని ఏలుతూ, అక్కడే ఉండిపోయాడు. అతని కొడుకు శశిబిందుడు బాహ్లిక దేశాన్ని పాలించాడు. ఇలకూ బుధుడికీ పుట్టిన

పురూరవుడు ఇలమహారాజు అనంతరం ప్రతిష్ఠానపురానికి రాజయ్యాడు.

రాముడీ కథ తన తమ్ములకు చెప్పి, లక్ష్మణుణ్ణి పంపి, తన పురోహితులైన వశిష్ట, వామదేవ, జాబాలి మొదలైన వారిని రప్పించి, తాను అశ్వమేధం తలపెట్టిన సంగతి వారికి తెలియజేశాడు. వారు చాలా సంతోషించారు.

అశ్వమేధానికి ప్రయత్నాలు వెంటనే ప్రారంభమై చాలా చురుకుగా సాగాయి. సపరివారంగా బయలుదేరి రావలసిందనీ, యజ్ఞోత్సవంలో పాల్గొన వలసిందనీ, లక్ష్మణుడు కిష్కింధలో సుగ్రీవుడికి, లంకలో విభీషణుడికి ఆహ్వానాలు పంపాడు. రాముడి మంచి కోరే రాజులందరికీ ఆహ్వానాలు వెళ్లాయి. నానా దేశాల బ్రాహ్మణులూ, ఋషులూ, సకుటుంబంగా గృహస్తులూ, గాయకులూ, నటులూ, నర్తకులూ ఆహ్వానించబడ్డారు.

నైమిశవనంలో గోమతీ నదీతీరాన యజ్ఞశాల నిర్మించబడింది. వేలకొద్దీ బళ్లతో ధాన్యం, అపరధాన్యాలూ, ఉప్పూ, గంధమూ చేరాయి. కోట్లకొద్దీ బంగారం వచ్చింది. వంటవాళ్లూ, శిల్పులూ వచ్చారు. రాముడి అంతఃపురం నుంచి అతని తల్లులూ, బంగారు సీతా భరతుడి వెంట వచ్చి యజ్ఞం జరిగే చోటికి చేరారు. ఆహ్వానితులకు విడుదులు వేరు వేరుగా ఏర్పాటు చేయబడ్డాయి. ఈ లోపలే రాముడు ఒక నల్లని గుర్రాన్ని విడిచి, దాని వెంట ఋత్విజులనూ, లక్ష్మణుణ్ణీ పంపాడు.

యజ్ఞం చూడవచ్చిన రాజులు రాముడికి కానుకలు తెచ్చారు. వారి సౌకర్యాలను భరత శత్రుఘ్నులు చూశారు. బ్రాహ్మణుల సౌకర్యాలను సుగ్రీవుడి వానరులూ, ఋషుల సౌకర్యాలను విభీషణుడి రాక్షసులూ చూశారు.

యజ్ఞం జయప్రదంగా జరిగింది. ఎవరికీ, ఏ లోటూ కలగలేదు. అందరికీ కావలసిన పదార్థాలు వడ్డన అయాయి. బంగారం, ధనం, రత్నాలు, బట్టలు, ఎవరేమికోరినా ఇచ్చారు. వీటిని పెద్దపెద్ద కుప్పలు పోసి రాత్రీ పగలూ అడిగినవారికి ఇస్తూనే వచ్చారు. అలాటి యజ్ఞాన్ని ఇంద్ర, కుబేర, యమాదులు కూడా చేసి ఉండరని చెప్పుకున్నారు. వానరులకూ, రాక్షసులకూ చేతినిండా పని పడింది. యాచకులు కోరినదల్లా వారే ఇస్తూ వచ్చారు. ఇలా ఏడాది గడిచి యజ్ఞం పూర్తి అయింది.





# పంచతంత్ర కథలు



నక్క కాకికి కొంగా, ఎండ్రకాయల కథ ఇలా చెప్పింది:

కొంగా, ఎండ్రకాయల కథ :

ఒక చెరువు గట్టున ఒక ముసలి కొంగ నివసిస్తూ ఉండేది. అది శ్రమ లేకుండా చేపలను తినాలనుకున్నది. అది నీటి అంచున దైన్యంతో నిలబడి, తనకు సమీపంగా వచ్చిన చేపలను కూడా తినటం మానేసింది.

చేపల మధ్య ఒక ఎండ్రకాయ ఉన్నది. అది కొంగను సమీపించి, ''మామా, ఇవాళ నువు తిండి, ఆటలూ మానేసినట్టున్నావేమిటి?'' అని అడిగింది.

దానికి కొంగ, ''ఎంతోకాలం చేపలను తిని సుఖంగా జీవించాను. అవి నా మిత్రులు, మీకందరికీ గొప్ప విపత్తు రానున్నది. అందు చేత, ఈ వార్ధక్యంలో నాకు సుఖజీవనం లేకుండా పోతున్నది. అదే నాకు పట్టుకున్న విచారం,'' అన్నది. ''ఈ రాబోయే కష్టం ఎలాటిది మామా?'' అన్నది ఎండ్రకాయ.

''ఇవాళ ఉదయం కొందరు జాలర్లు అనుకుంటుంటే విన్నాను: 'ఇది చాలా పెద్ద చెరువు. ఇందులో చాలా చేపలున్నాయి. ఆదివారం సాయంకాలానికల్లా మిగిలిన నాలుగు చెరువుల్లోనూ వేట ముగించి, సోమవారం తెల్లవారేసరికి ఇక్కడికి వచ్చి, మనం కొత్తగా చేసిన వలలతో చేపలనూ, ఇతర జలచరాలనూ పట్టేద్దాం' కనుక, వారం తిరిగేసరికి ఈ చెరువులో ఒక్క చేపగాని, ఇతర జలచరం గాని మిగలదు. ఇవాళ సోమవారం గద. ఈ వార్ధక్యంలో నాకు నోటి ముందరి కూడు కాస్తా పోతుంది,'' అన్నది కొంగ.

కొంగ చెప్పిన మాయమాటలు విని చెరువులోని చేపలూ, ఇతర జీవాలూ ప్రాణభయంతో కొట్టుకుపోయాయి. అవి అన్నీ తమ తమ వయసునూ, హోదానూ బట్టీ కొంగను తండ్రీ, తాతా, మామా, అన్నా, మిత్రమా, గురూ అని సంబోధిస్తూ, ''ఆపద గురించి ముందుగా మాకు తెలియజేయడం మంచిదయింది. ఈ

మిత్రభేదం - 8



ఆపదనుంచి మమ్మల్ని కాపాడటం నీకు సాధ్యం కాకపోదు,'' అన్నాయి.

''అండజాన్ని అయిన నేను పిండజాలైన మనుషులతో ఏం పోటీ చేయగలను. మీరంతా నాతో సహకరిస్తే ప్రయత్నం ఫలించవచ్చు. కొద్ది దూరంలో ఒక పెద్ద దేవాలయం ఉన్నది. దాని పక్కన లోతైన కోనేరున్నది. దానినిండా తామరపూలు ఉన్నాయి. ఆ కోనేట్లో చేపలు పట్టరాదు. అక్కడ మీరు క్షేమంగా ఉండ వచ్చు. జట్లు, జట్లుగా మిమ్మల్ని నా వీపు మీద ఎక్కించుకుపోయి, అక్కడ చేర్చ గలను,'' అని కొంగ అన్నది. ఈ మాటలు విని మోసపోయిన చేపలన్నీ ఆనందంతో కొంగకు తమ కృతజ్ఞత తెలుపుకున్నాయి. కొంగ కూడా లోలోపల నవ్వుకుని, చేపలను మోసగించి తేలికగా తినవచ్చనుకున్నది.

అది ఒక్కొక్క జట్టు చేపలనూ తన వీపు మీద ఎక్కించుకుని, దేవాలయపు కోనేరు కని బయలుదేరి, ఎండకు కాలిన ఒక కొండరాతి మీదవాలి, చేపలను దానిమీదపడేసి, తింటూ వచ్చింది. రోజు రోజుకూ దాని ఆనందం పెరిగి పోతున్నది. చెరువులో మిగిలి ఉన్న చేపలకు అనుమానం కలగకుండా, కొలను చేరిన చేపల నుంచి సందేశాలు తెచ్చి చెబుతూ ఉండేది. ఎండ్రకాయకు కూడా ప్రాణభయం పట్టు కుని, జాలరులు వచ్చే రోజు దగ్గిర పడుతూ ఉండటం చేత, ''మామా నన్ను కూడా రక్షించుదూ!'' అని కొంగను వేడుకున్నది.

రోజూ చేపలను తిని మోహం మొత్తి ఉండటం చేత కొంగ, కొత్త రకం ఆహారం తినవచ్చునన్న ఆశతో, ఎండ్రకాయను తన వీపుమీద ఎక్కించుకుని ఉత్సాహంగా ఎగిరి పోయి, కొండరాయిమీద వాలబోయింది.

''మామా, దేవాలయం ఏది? లోతైన కోనే రేది?'' అని ఎండ్రకాయ కొంగను అడిగింది.

కొంగవెటకారంగా, ''ఆ రాయిని చూశావా? నేను చెరువు నుంచి తెచ్చిన చేపలన్నీ దాని మీదనే శాశ్వత శాంతి సంపాదించుకు న్నాయి,'' అన్నది.

ఎండ్రకాయ తొంగి చూసేసరికి ఆ రాతి మీద అనేకంగా చేపల ఎముకలు కనిపిం చాయి. అప్పుడది తనలో, ''ఈ ప్రపంచంలో తెలివిగల వాళ్లు తమ స్వార్థం కొరకు మిత్రులై ఉండి కూడా శత్రువులు గానూ, శత్రువులై ఉండి కూడా మిత్రులుగానూ, అభినయి స్తారు. శత్రువులై ఉండి కూడా మిత్రులుగా నటించే వారితో చెలిమి చెయ్యటం కన్న పాములతో చెలిమి మంచిది. కొంగ చేపలన్ని టినీ అదివరకే తినేసిందన్నమాట. వాటి

ఎముకలే ఇవన్నీ, వాటికోసం పగతీర్చుకోవడానికి ఇది అద్భుతమైన అవకాశం,'' అనుకున్నది. కొంగ రాతిమీద వాలబోతుండగా ఎండ్రకాయ, కొంగ తనను రాతి మీద పడెయ్యక ముందే దాని మెడను తన గిట్టలతో గట్టిగా పట్టేసింది. ఆ పరిస్థితిలో కొంగ ఎండ్రకాయను ఏమీ చెయ్యలేక పోయింది. అది అక్కడనుంచి ఎగిరి పోబోయింది. కాని, ఎండ్రకాయ సన్నగా ఉన్న కొంగ మెడను గిట్టల మధ్య గట్టిగా పట్టి, తెగిపోయే దాకా నొక్కింది. తరవాత ఎండ్రకాయ కొంగతలను పట్టుకుని చెరువుకు తిరిగి వచ్చింది.

అక్కడ ఉన్న చేపలు ఎండ్రకాయను, ''అన్నా, తిరిగి వచ్చావేం?'' అని అడిగాయి.

ఎండ్రకాయ, వాటికి కొంగ తలను చూపి, ''ఈ దుష్టుడి మాటలు నమ్మి, పాపం చేపలన్నీ చచ్చిపోయాయి. ఈ నమ్మకద్రోహిని చంపి, వాడి తల తెచ్చాను. పల్లెకారుల కథ అంతా ఈ దుర్మార్గుడి కల్పన,'' అన్నది.

నక్క ఈ కథ చెప్పిన తరవాత కాకి, ''మిత్రమా, పామును ఎలా చంపాలో చెప్పు,'' అన్నది. నక్క ఇలా అన్నది. ''ఏదైనా గుడికో, కోనేరుకో వెళ్లు; ధనికులది ఏ రత్నహారమో, మరేదైనా నగో తీసుకుని వచ్చెయ్యి. జనం నీ వెంట పడతారు. వాళ్లు చూసేటట్టుగా ఆ నగను పాము పుట్టలో పడెయ్యి. వారు ఆ నగకోసం తప్పక పుట్టను తవ్వుతారు. అప్పుడు పామును తప్పక చంపేస్తారు.''

కాకి తన ఇంటికి వెళ్లి, నక్క చెప్పిన ఉపాయం తన భార్యకు చెప్పింది. రెండూ బయలు దేరి రాజభవనం లోని కొలనుకు వెళ్లాయి. త్వరలోనే రాణి స్నానానికి కొలనుకు వచ్చి, తన రత్న హారమూ, ఇతర నగలూ తీసి ఒడ్డున పెట్టి, కొలనులోకి దిగి జలకాలాడ సాగింది. ఆడ కాకి చప్పున రత్నహారాన్ని తీసుకుని తన గూడు ఉన్న చెట్టుకేసి నింపాదిగా ఎగురుతూ పోయింది. ఇది చూసి మనుషులు గట్టిగా అరుస్తూ, దుడ్డుకర్రలతో వెంట పడ్డారు. ఆడ కాకి రత్నహారాన్ని పాముపుట్టలో పడేసి, ఎడంగా ఒక కొమ్మ మీద వాలి గమనించసాగింది. ప్రతీహారులూ, సేవకులూ హారం కోసం పుట్ట తవ్వారు. పాముకు కోపం వచ్చి, పుట్టలో నుంచి పైకి వచ్చింది. అందరూ చేరి పామును చంపి హారం తీసుకుపోయారు.

ఈ విధంగా కాకులకు పాము బెడద తీరిపోయింది.



# చందమామ లోకజ్ఞానం క్విజ్ - 18

(పదహారేళ్ళ లోపు పిల్లలకు)

**Co-sponsored by Infosys FOUNDATION, Bangalore**

అన్నీ సరైన సమాధానాలు రాసిన ఒకరికి బహుమతి రూ. 250లు.*

*సరైన సమాధానాలు రాసినవారు ఒకరికన్నా ఎక్కువ మంది ఉన్నట్లయితే ఒక్కొక్క విజేతకు 50 రూ.లు బహుమతిగా ఇవ్వబడుతుంది.

మీరు చేయవలసిందేమంటే :

1. సమాధానాలు రాయండి.
2. మీ పేరు, వయసు(16 ఏళ్ళ లోపు ఉండాలి) పిన్ కోడ్‌తో సహా పూర్తి చిరునామా రాయండి.
3. చందాదారు అయితే, ఆ నంబర్ రాయండి.
4. కవరు మీద చందమామ లోకజ్ఞానం క్విజ్ - 18 అని రాసి, చందమామ పూర్తి చిరునామా రాసి మాకు పంపండి.
5. జూలై నెలాఖరులోగా మీ ఎంట్రీలు మాకు అందాలి.
6. సెప్టెంబర్ 2010 సంచికలో ఫలితాలు వెలువడుతాయి.

## పురాణాలు



1. వేదశ్రుతిని ఏ ఇతిహాసంలో ప్రస్తావించారు?
2. ద్రోణాచార్యుడి భార్యాపుత్రుల పేర్లు ఏమిటి?
3. గౌతముడి ధర్మపత్ని అహల్యకు శాపవిముక్తి కలిగించినది ఎవరు?
4. కౌరవ, పాండవుల పితామహుడు ఎవరు?
5. బలరాముడి తల్లి ఎవరు?
6. రామాయణంలో, సీతను అపహరించుకుపో తున్న రావణుడిని అడ్డుకోవడానికి ప్రయత్నిం చిందెవరు?
7. మహావిష్ణువు ఎత్తిన అవతారాలు ఎన్ని?
8. హిందూ పురాణాల ప్రకారం, మృత్యుదేవత ఎవరు?

### చందమామ లోకజ్ఞానం క్విజ్-16 మే 2010 సమాధానాలు

1. క్రిప్టోన్, 2. ఓ అణుధార్మిక స్పైడర్ కాటు వల్ల, 3. ది ఇన్‌క్రెడిబుల్ హల్క్, 4. స్పైడర్ మ్యాన్, 5. అబద్ధాలను కనిపెట్టడంలో ఆమెకు సాయపడుతుంది, 6. జెనా, 7. హెలెనా, 8. క్లార్క్ కెంట్, 9. హీత్ లెడ్జర్

గమనిక: సరైన సమాధానాలు గల ఎంట్రీలు రాలేదు గనక బహుమతులు ఇవ్వలేకపోతున్నాము.

# సుడోకు పజిల్

కింది రెండు సుడోకు పజిల్స్‌ని పరిష్కరించి, మీ పరిష్కారాలను మాకు పంపించండి. ప్రతి వరుసలో 1 నుంచి 9 వరకు అంకెలు అడ్డంగా, నిలువుగా నింపండి. ఒక వరుసలో ఒక అంకెను ఒకసారి మాత్రమే వాడాలి. ప్రతి 3X3 చదరంలోనూ 1 నుండి 9 అంకెలు ఉండాలి. పజిల్స్‌కు పరిష్కారాలు సెప్టెంబర్2010 సంచికలో ప్రచురించబడతాయి. సరైన సమాధానం పంపిన విజేతకు రూ.500 బహుమతి ఉంటుంది.

పజిల్ - 1

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| | | | | | 7 | 6 | | |
| 3 | | | 1 | 2 | | | 9 | 7 |
| 5 | 6 | | | | | | | |
| 8 | | 6 | | 1 | | | | |
| 7 | 9 | | | | | 4 | | 5 |
| | | | | 6 | | | 7 | |
| 6 | 7 | | 3 | | | | | 4 |
| | | 9 | | | 8 | | | |
| | | | 2 | | | 3 | | 6 |

పజిల్ - 2

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| | 4 | | | | | | | |
| | | | 9 | | | | | 1 |
| | 8 | 5 | | 7 | | | | 9 |
| | | | | | 1 | | | 4 |
| | 7 | | | 5 | | | 6 | |
| 9 | | | 2 | | | | | |
| | | | | 6 | | 8 | 7 | |
| 2 | | | | | 3 | | | |
| 8 | | | | | | | 5 | |

మీ ఎంట్రీలను 2010 జూలై 25వ తేదీలోగా పంపించండి. పంపవలసిన చిరునామా:

**Editor, SUDOKU PUZZLE, CHANDAMAMA INDIA LTD.,**
B-3, Cross Road 'B', MIDC, Andheri (East), Mumbai-400093.
e-mail your entries to:contests@chandamama.com

---

మే' 10 నెల సుడోకు పజిల్స్‌కు సరైన పరిష్కారాలు:

పజిల్ - 1

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| 3 | 6 | 7 | 9 | 2 | 8 | 1 | 5 | 4 |
| 5 | 9 | 2 | 1 | 4 | 3 | 7 | 8 | 6 |
| 1 | 8 | 4 | 5 | 7 | 6 | 3 | 9 | 2 |
| 6 | 1 | 8 | 2 | 3 | 7 | 5 | 4 | 9 |
| 2 | 4 | 9 | 6 | 1 | 5 | 8 | 3 | 7 |
| 7 | 5 | 3 | 8 | 9 | 4 | 2 | 6 | 1 |
| 8 | 7 | 5 | 4 | 6 | 1 | 9 | 2 | 3 |
| 9 | 3 | 6 | 7 | 5 | 2 | 4 | 1 | 8 |
| 4 | 2 | 1 | 3 | 8 | 9 | 6 | 7 | 5 |

సుడోకు పోటీ ఫలితాలు: మీరు పంపిన సమాధానాలకు కృతజ్ఞతలు, మే నెల సమస్యకు సరైన సమాధానాలు రానందున బహుమతి ఇవ్వలేకపోతున్నాము.

పజిల్ - 2

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| 8 | 9 | 5 | 6 | 4 | 7 | 1 | 3 | 2 |
| 3 | 2 | 6 | 9 | 5 | 1 | 8 | 4 | 7 |
| 4 | 1 | 7 | 3 | 8 | 2 | 9 | 5 | 6 |
| 9 | 7 | 8 | 2 | 6 | 5 | 4 | 1 | 3 |
| 1 | 5 | 4 | 7 | 9 | 3 | 6 | 2 | 8 |
| 2 | 6 | 3 | 8 | 1 | 4 | 7 | 9 | 5 |
| 6 | 8 | 1 | 5 | 3 | 9 | 2 | 7 | 4 |
| 7 | 3 | 9 | 4 | 2 | 6 | 5 | 8 | 1 |
| 5 | 4 | 2 | 1 | 7 | 8 | 3 | 6 | 9 |

# యురేకా

## మ్యాచ్ బాక్స్ రైడర్ తయారీ విధానం

మీరు మీ చేతిని లాగుతున్నప్పుడు, ఈ బొమ్మ అగ్గిపెట్టె దారపు రైల్ ట్రాక్ మీద సాగుతుంది.

## ఏమేం కావాలి?

- ఖాళీగా ఉన్న అగ్గిపెట్టె కార్డ్ బోర్డ్
- మందపు ద్వారం
- పెద్ద సూది









## తయారు చేయడం ఎలా?

- అగ్గిపెట్టె రెండువైపులా నాలుగు రంధ్రాలు చేయండి. అగ్గిపుల్లలు ఉండే పెట్టె డ్రాయర్‌పై రెండు, అగ్గి పుల్లలను మండించే పెట్టె ఉపరితలంపై రెండు రంధ్రాలు చేయండి.
- 1.5 మీటర్ల పొడవు గల దారానికి గుచ్చిన సూదిని తీసుకోండి. పెట్టె ఉపరితలానికి చేసిన రంధ్రం నుంచి పెట్టె డ్రాయర్ లోని రంధ్రంలోకి దారపు సూదిని పంపండి. మిగతా రంధ్రాలకు కూడా పైన సూచించిన విధంగా దారపుసూదిని పంపండి. దారం దూర్చిన అగ్గి పెట్టె ఇప్పుడు సిద్ధంగా ఉంది.
- దారం రెండు కొసలను ముడివేయండి. దీంతో దీని మెకానిజం పూర్తవుతుంది.
- రెండు చేతులతోటీ దారాన్ని పట్టి ఉంచండి. అగ్గిపెట్టెను కుడిభాగానికి జారవిడవండి. ఎడమ చేతిని తిప్పి వంచండి. అగ్గిపెట్టె మీ ఎడమచేతి వైపుగా దారపు ట్రాక్ మీద ప్రయాణిస్తుంది.
- అగ్గిపెట్టెమీద ఏదో ఒక జంతువు చిత్రాన్ని అంటించి అది అగ్గిపెట్టెతో పాటుగా జారుతుంటే చూసి ఆస్వాదించండి. ఈ మెకానిజం ఒకవేపు మాత్రమే కదులుతూంటుంది. అది ఎడమ చేతి చివరకు చేరుకోగానే మీరు మళ్లీ దాన్ని వెనక్కు తీసుకురావలసి ఉంటుంది.

కాన్సెప్ట్:

మనం పైభాగాన ఉన్న దారాన్ని లాగుతున్నప్పుడు, అగ్గిపెట్టె పైభాగం వైపు వంగుతుంది. ఘర్షణ కారణంగా అది ఆ స్థితిలో నొక్కి పట్టి ఉంచబడుతుంది. అది కింది దారంతో పాటు ఎడమకు జారుతుంది. అదేవిధంగా కింద ఉన్న దారాన్ని మనం లాగుతున్నప్పుడు, అగ్గిపెట్టె కింది వైపుకు వంగుతుంది. అయితే ఇప్పుడది పైనున్న దారంతోపాటు ఎడమకు జారుతుంది.

రచన: అరవింద గుప్తా (పూణెలోని ఇంటర్ - యూనివర్శిటీ సెంటర్ ఫర్ ఆస్ట్రానమీ అండ్ ఆస్ట్రో ఫిజిక్స్ భాగంలో విజిటింగ్ సైంటిస్టుగా పనిచేస్తున్నారు.)



# ఆత్మాహుతి

ధర్మగిరి రాజుగారి ఖజానాలోనుంచి వెయ్యి బంగారు నాణాలు, ఎవరో దొంగిలించారు. ఆ దొంగను పట్టుకునే బాధ్యత యుక్తి వర్మకు అప్పగించాడు రాజు. ఇందుకు ఆయన ఒక షరతు పెట్టాడు. యుక్తివర్మ దొంగను రెండవ రోజు సూర్యాస్తమయం లోపల పట్టుకోవాలి. అలా చేయలేకపోతే, యుక్తివర్మ ఆత్మాహుతి చేసుకోవాలి.

దీనికి యుక్తివర్మ ఒప్పుకుని, ''మహా రాజా, ఒకవేళ నేను దొంగను పట్టుకోలేక పోతే, నా ఆత్మాహుతి తర్వాత అతణ్ణి మంత్రుల్లో ఒకడిగా నియమించాలి. ఎందుకంటే దొంగతనం చేసి, నా అంత వాడికే పట్టుబడలేదంటే, అతడు మహా మేధావి అయివుండాలి'' అన్నాడు.

రెండవరోజు సూర్యాస్తమయం కావడా నికి, ఇంకా కొన్ని ఘడియలే ఉన్నాయి. ఆ సమయంలో నిండుకొలువు దీరివున్న రాజుగారితో యుక్తివర్మ, ''మహారాజా, నాకు దొంగ పట్టుబడలేదు. నేను ఆత్మా హుతి చేసుకోబోతున్నాను. నేను కోరిన విధంగా, ఆ దొంగను మంత్రిని చేసి, నా ఆత్మకు శాంతి కలిగించండి'' అన్నాడు.

''అయితే, నన్ను మంత్రిగా నియ మించండి, మహారాజా!'' అంటూ కోశాధి కారి ఆనందంగా లేచి నిలబడ్డాడు.

రాజుగారు ఆజ్ఞాపించగానే, భటులు కోశాధికారిని బంధించారు. యుక్తివర్మను ఎంతగానో మెచ్చుకుని, రాజు అతణ్ణి మంత్రిగా నియమించి సత్కరించాడు.

– వడ్లమన్నాటి కుటుంబరావు



# పిల్ల మేఘం




త్రిగర్త దేశంలో అందరూ కర్షకులే. ఆ దేశం ఎల్లప్పుడూ పాడిపంటలతో సమృద్ధిగా ఉండేది. అక్కడి ప్రజల సుఖసంతోషాలు పూర్తిగా వానదేవుడి పైనా, అతడు పంపే మేఘాలపైనా ఆధారపడి ఉండేవి.

అయితే త్రిగర్త ప్రజలు ఎందరెందరు దేవుళ్ళనో ఆరాధించేవాళ్లు. కానీ, వానదేవుణ్ణి, మేఘాలనూ ఆరాధించేవారు కారు. కనీసం మేఘాలకు చెయ్యెత్తి దణ్ణం పెట్టి తమ కృతజ్ఞత తెలుపుకునేవారైనా కారు. ఇది చూసి మేఘాలకు కోపం వచ్చేసింది.

మేఘాలన్నీ దూర ప్రాంతాన సమావేశమై, త్రిగర్త దేశంమీద ఈ సారి ఒక్క చినుకు కూడా రాల్చకూడదని ఏకగ్రీవంగా తీర్మానించుకు న్నాయి. తమ కూటమిలోని మేఘాలేవీ త్రిగర్త దేశం వైపుకు పోరాదని ఆదేశాలు జారీ చేశాయి.

దాని ఫలితంగా త్రిగర్త దేశానికి ఆ యేడు వర్షాకాలం వచ్చింది. కాని వర్షాలు రాలేదు. అక్కడి ప్రజలు కళ్ళు చిల్లులు పడేటట్టు ఆకాశంకేసి తెగ చూశారు. ఎక్కడా ఒక్క చిన్న మబ్బు తునక కూడా లేదు. ప్రజల ఆందోళన అంతా ఇంతా కాదు.

వాళ్ళు పడే ఆవేదన చూసి మేఘాలు మహా సంతోషించాయి. వర్షాలు కురవకపోతే వ్యవసాయమే ఆధారంగా బతికేవారి పరిస్థితి దుర్భరమైపోతుంది.

కాని తలవని తలంపుగా ఆ మేఘాల సంతోషానికొక పెద్ద దెబ్బ తగిలింది. ఒకానొక రోజు ఒక పిల్లమేఘం ఇతర మేఘాలతో చెప్పకుండా చెయ్యకుండా త్రిగర్త దేశానికి వెళ్లి అక్కడ నింపాదిగా ఒక జల్లు కురిసి వచ్చింది.

దీంతో, జనం సంతోషానికి అంతే లేదు. అమ్మయ్య, వర్షాలు ఆరంభమయ్యాయి అనుకుని త్రిగర్త ప్రజలు తావు దాచి ఉంచిన విత్తనాలు చల్లి, నారుమళ్ళు వేసు కున్నారు.

ఈ లోపల పెద్ద మేఘాలు పిల్ల మేఘాన్ని పిలిచి నానా చివాట్లూ పెట్టాయి. ఏమిటి నీ ఉద్దేశం? మేమంతా కలిసి త్రిగర్త ప్రజలకు వాన బొట్టు లేకుండా చేసి ఏడిపించాలని తీర్మానించుకుంటే, ఎవరికీ చెప్పకుండా పెట్టకుండా వెళ్లి వానకురిసి వస్తావా? నీ కేమన్నా బుద్ధి ఉందా? అని తిట్టినతిట్టు తిట్టకుండా తిట్టాయి.

''మీ తెలివి తెల్లారినట్టే ఉంది. నేనొక్క చిన్న జల్లుతో, ఆ త్రిగర్తులు దాచుకున్న విత్తనాల గింజలు కూడా వాళ్ళకు దక్కకుండా నేలపాలు చేయించి వచ్చాను. ఆ సంగతి మీరు గ్రహించటం లేదు'' అన్నది పిల్లమేఘం పెద్ద మేఘాలతో.

తరవాత త్రిగర్త దేశ ప్రజల పరిస్థితి ఇప్పుడెలా ఉన్నదీ చూడటానికి పెద్ద మేఘాలు కదిలివచ్చాయి. ఈలోపుగా జనం తహతహలాడి పోతున్నారు. వారి పరిస్థితి అటూఇటూ కాకుండా పోయింది. ఒక్క జల్లు పడగానే వానలు ఆరంభమయ్యాయిగదా అనుకుని, వాళ్ళు దాచుకున్న విత్తనాలను కాస్తా మళ్ళలో చల్లేశారు. ఆ తరవాత మళ్ళీ చినుకులేదు. వాళ్ళు అదేపనిగా ఆకాశానికేసి చూస్తూ, వానదేవుడికీ, మేఘాలకూ దణ్ణాలు పెట్టుకుంటూ, ఆక్రోశిస్తున్నారు.

వాళ్ళను చూసేసరికి పెద్ద మేఘాలకు ఎక్కడలేని జాలీ పుట్టుకొచ్చింది. అవి పిల్ల మేఘాన్ని, పెద్దవాళ్ళతో చెప్పకుండా ఇలాంటి అల్లరి చిల్లర పనులెన్నడూ చెయ్యకు అని మందలించి, త్రిగర్త దేశంపైన కుండపోతగా వర్షించి, తమదారిన తాము వెళ్ళిపోయాయి. తమ ప్రార్థనలు విని, మొరలాలకించి వర్షం ప్రసాదించినందుకు త్రిగర్త ప్రజలు అది మొదలు వానదేవుడికి కొలుపులు చేస్తూ వచ్చారు. అప్పటి నుండి అక్కడ ఏనాడూ అనావృష్టి లేదు. అది సుక్షేత్రమైన ప్రదేశం.

దీనికంతకూ మూలకారణం పిల్లమేఘమేనన్న సంగతి పెద్దమేఘాలకు తెలీదు. అది ఆకతాయితనంగా చేసిన పని చివరకు త్రిగర్త ప్రజల మంచికే దారితీసింది. మరోవైపున పెద్ద మేఘాలచేత తలవాచేటట్టు చివాట్లు తిన్న కారణంగా పిల్లమేఘానికి కూడా తాను ఘనకార్యం చేసిన సంగతి తెలీదు పాపం.





# చందమామ - చెల్లాయి



చల్లని సాయంత్రం వేళ, రమా, ఉమా, చక్కగా కబుర్లు చెప్పుకుంటున్నారు. ఎప్పు డొచ్చాడో, చందమామ, మబ్బుల వెనకాల నుంచీ తొంగి చూస్తున్నాడు. ఉమ చంద్రు డికేసి చూసింది. సరిగ్గా ఇలాంటిదే ఆ సాయంత్రం కూడా. గుర్తుకొచ్చి ఒళ్ళు గగు ర్పొడిచింది. అంతలోనే ఫక్కున నవ్వొచ్చింది. రమకి ఏమీ అర్థం కావడం లేదు. అయోమ యంగా స్నేహితురాలి వైపు చూసింది. ఉమ చిన్నగా నవ్వడం చూసి, అమ్మయ్య అని ఊపిరి పీల్చుకుంది.

''సంగతేంటో చెప్తాను విను,'' అంటూ, ఉమ ఇలా చెప్పింది.

''ఇరవై ఏళ్ళ క్రితం, ఇలానే ఒక రోజు సాయంత్రం, పెరటి మెట్ల మీద కూర్చుని చందమామను చూస్తున్నాను. అలా చూడ డమంటే నాకు చాలా ఇష్టం. పక్క వీధి నుంచి మా ఇంటికి వస్తూ, దారిలో చంద మామ నా వెంట వస్తున్నాడో లేదో అని చూసుకుంటూనే ఉండే దాన్ని. బస్సులో మా అమ్మమ్మ వాళ్ళ ఊరికి వెళ్ళేటప్పుడు బస్సు కిటికీలోంచి చంద్రుడిని చూస్తూనే ఉండే దాన్ని. ఎంత దూరం మాతో అలా రాగలుగుతాడు అని అనుమానం. చెట్టెక్కితే చందమామ చేతికి అందుతాడని అనుకునే దాన్ని. మేడ మీదకు ఎక్కినప్పుడు అందక పోతే, కొండ మీద ఎక్కితే అందుతాడేమో అనిపించేది. ఎంతో దూరంలో ఉంటాడని తెలిసినా, అందుకోగలనని ఊహించు కోవాలనిపించేది.''

''మరి చందమామ అంటే నీకు అంత ఇష్టమైతే, నువ్వు ఇందాక గుర్తు చేసుకుని భయపడినది దేనికి?'' అని అడిగింది రమ.

''చెప్తున్నాను విను,'' అంటూ ఉమ ఇంకా ఇలా చెప్పింది, ''నా చందమామ సరదాను చాలా ఆట పట్టించే వాడు మా అన్నయ్య.

గోదావరి లలిత

పొద్దు తిరుగుడు పువ్వు సూర్యుడితో పాటు తిరుగుతుంది. చెల్లాయేమో చంద్రుడితో!'' అనే వాడు.

''నిజమే అనిపిస్తోంది మరి!'' అంది రమ నవ్వుతూ.

ఉమ కూడా నవ్వి కథ కొనసాగించింది, ''కాసేపయ్యాక బావి దగ్గరికెళ్ళి బావిలోకి తొంగి చూస్తున్నాను. బావి నీళ్ళలో చంద మామ తేలి ఆడుకుంటున్నట్టు ఊహించు కుంటున్నాను. ఇంతలో పెద్ద శబ్దం వినిపిం చింది! గుండె ఝల్లుమంది. గిరుక్కున పరిగెత్తుకుంటూ వెనక్కి తిరిగి వెళ్ళి చూస్తే, అప్పటి వరకూ అక్కడ పుస్తకం చదువు కుంటూ కూర్చున్న మా అన్నయ్య కనిపించ లేదు! పుస్తకం కింద పడి ఉంది. కుర్చీ కూడా తల్లకిందులుగా ఉంది. మా అమ్మా, నాన్న, బయటికి ఏదో పని మీద వెళ్ళారు. ఇంకా చాలా సేపటి దాకా రారు. మా అన్నయ్యని పిలుస్తూ, ఇల్లంతా తిరిగి చూశాను. కిటికీ లోంచి చందమామ కనిపిస్తుంటే, అప్ర యత్నంగా అటు వైపు చూశాను. కిటికీ పక్కన ఉన్న అద్దంలో మా అన్నయ్య ప్రతి బింబం కనిపించింది. బట్టలు పెట్టుకునే గూటికి కట్టి ఉన్న తెర వెనక దాక్కుని, తొంగి చూస్తూ అద్దంలో కనిపించి నాకు దొరికిపో యాడు.'' అని ఒక క్షణం ఆగింది.

''అంతేనా?'' అంది రమ.

''ఇంకా ఉంది, చెప్తాను విను,'' మళ్ళీ చెప్పడం మొదలు పెట్టింది, ఉమ.

''అన్నను పట్టి ఇచ్చిన చందమామకు కృతజ్ఞతలు చెప్పుకుని పెరట్లోకి వెళ్ళాను, ఇంకా, అన్నయ్యను గట్టిగా పిలుస్తూనే. పెరట్లో అన్న పడేసి శబ్దం చేసిన పెద్ద బండ రాయొకటి కనిపించింది. ఆ రాయిని దొర్లిం చుకుంటూ బావి దగ్గరకు తీసుకెళ్ళి ఎత్తి నీళ్ళలో పడేశాను, 'అన్నయ్యా!' అని గట్టిగా అరుస్తూ. మా అన్నయ్య ఒక్క ఉదుటున పరిగెత్తుకుని వచ్చి చూశాడు...నాకు నవ్వాగ లేదు,'' అని ఉమ చెపుతుంటే, రమ నవ్వడం మొదలు పెట్టింది.

''చందమామ సాయం చేశాడు కాబట్టి దొరికిపోయాను, లేకపోతేనా....'' అంటూ వెనకాలనుంచి చిన్నగా ఎవరో గొణుక్కోవడం వినిపించింది.



# ముక్తా ఆకాష్

దేశవ్యాప్తంగా బాల విలేకరులు రాసి పంపిన కథనాలను మీ ముందుకు తీసుకువస్తామని మేము వాగ్దానం చేసిన ప్రకారం, అస్సాం, డిబ్రూగర్‌లోని యంగ్ రిపోర్టర్స్ న్యూస్ లెటర్ నుంచి ముక్తా ఆకాష్ అనువదించిన కథనాన్ని మేము ఇక్కడ పొందుపరుస్తున్నాము. ఇది మొదట అస్సామీలో ప్రచురించబడింది.

## శిశు పంచాయితీలలో చేతులు శుభ్రంగా ఉంచుకోవడంపై జాగరూకతా ప్రచారం

చేతుల్ని పరిశుభ్రంగా ఉంచుకోవలసిన అవసరంపై జాగరూకతను సృష్టించే ప్రచార కార్యక్రమంలో భాగంగా, అలిమూర్ రూప్‌కన్వార్ కాలేజియేట్, జటియా విద్యాలయ, అలిమూర్ ఆదర్శ జటియా విద్యాలయ మరియు సౌమార్పిత్ హయ్యర్ సెకండరీ పాఠశాలలు 2009 అక్టోబర్ 24న ఓ కార్యక్రమం ప్రారంభించాయి. రూప్‌కన్వార్ కాలేజియేట్ స్కూల్ నుంచి సౌమార్పిత్ స్కూల్ వరకు సాగే 9వ నంబర్ డికోమ్ టీ గార్డెన్ లైన్ మార్గంలో ఉదయం గం. 11.30లకు విద్యార్థులు ఓ ప్రదర్శన నిర్వహించారు.

ఆ ప్రదర్శనలో, వ్యాధులనుంచి జీవితాన్ని విముక్తి కోవడంలో భాగంగా చేతులు శుభ్రంగా ఉంచుకోవలసిన అవసరంపై విద్యార్థులు పలు నినాదాలు చేశారు. ఈ సందర్భంగా డికోమ్ టీ ఎస్టేట్ నుంచి వచ్చిన బాలుడు దిలీప్ ఒరాంగ్ మాట్లాడుతూ, భోజనానికి ముందు, మరుగుదొడ్డికి పోయి వచ్చిన తర్వాత చేతుల్ని సబ్బుతో శుభ్రపర్చుకోవాలనే విషయం తనకు అంతవరకు తెలియదని చెప్పాడు.

అమీర్ పాటోర్ అనే మరో విద్యార్థి మాట్లాడుతూ, చేతులు శుభ్రం చేసుకోకుంటే వ్యాపించే వ్యాధుల గురించి మా ప్రాంత ప్రజలకు మేము వివరించి చెప్పామని తెలిపాడు. హేమాలి ఘర్పాలియా అనే విద్యార్థి ప్రకారం, ''అప్పుడప్పుడు వీళ్లవద్దకు చేరి గుర్తు చేయకపోతే వాళ్లు తమ అలవాట్లను మార్చుకోలేరు. ఎందుకంటే పాత అలవాట్లు అంత త్వరగా పోవు''

– మంజు మింజ్, 14 సంవత్సరాలు

## క్రమరాహిత్యం లోంచి క్రమత్వంలోకి...

ఇటీవల కాలం వరకు మూడో తరగతి విద్యార్థి బిర్లా ముండా అనేకసార్లు బడి ఎగ్గొట్టేవాడు. ఇప్పుడు మాత్రం అతడు పాఠశాలకు రోజు హాజరవుతున్నాడు. బిర్లా తల్లి జోనాలి ముండా అతడిలో వచ్చిన మార్పుకు పొంగిపోయింది. ఆమె ఇలా చెప్పింది. ''బిర్లా బడికి పోవాలంటే ఎప్పుడూ ఇష్టపడేవాడు కాదు. రోజు మధ్యలోనే అతడు బడినుంచి పారిపోయేవాడు. కాని, ఇప్పుడు పరిస్థితులు మారాయి. అతడు రోజూ బడికి పోతూ ఉండటం చూస్తుంటే నాకు చాలా సంతో

షంగా ఉంది.'' ఈ ఘనత అంతా పొరుగున ఉన్న కల్పనా శిశు పంచాయితీ సభ్యులకే దక్కు తుంది మరి.

2009 మార్చి నుంచి జూన్ వరకు బడి ఎగ్గొట్టిన విద్యార్థులకు అలిముర్ ఆదర్శ జటియా విద్యాలయలో కల్పనా శిశు పంచాయితీ సభ్యులు పాఠాలు చెప్పారు. దీనికి సంబంధించి పంచాయితీ అధ్యక్షుడు 14 ఏళ్ల బిరెసన్ పాటోర్ ఇలా చెప్పాడు. ''మేం ప్రతి వారమూ శనివారం సాయంత్రం రెండుగంటలు, ఆదివారం ఉదయం మూడుగంటలు మా పొరుగునే ఉన్న బడి వది లేసిన విద్యార్థినీ విద్యార్థులకు పాఠాలు చెప్పే వారం. మేం వారికి అస్సామీస్, ఇంగ్లీష్, లెక్కలు బోధించేవారం. మా ప్రిన్సిపాల్ రమేష్ మహిలి, టీచర్ మోనికా శర్మల సహాయం తీసుకున్నాము. అయితే రానున్న అర్ధ సంవత్సర పరీక్షల కార ణంగా మేము వారికి పాఠాలు చెప్పడం ఆపి వేశాము.'' బడి మానేసిన వారిలో చాలామంది ఇప్పుడు మళ్లీ బడికి పోతున్నారని అతడు చెప్పాడు. మళ్లీ బడిలో చేరిన ఏడేళ్ల బసంతి ఈ సందర్భంగా ఇలా చెప్పింది. ''గతంలో నేను బడికి పోవడానికి ఇష్టపడేదాన్ని కాదు. కాని, బిరేశన్ అతడి సహవిద్యార్థులు మాకు పాఠాలు చెప్పడం మొదలెట్టాక, విషయాలు బాగా ఆసక్తికరంగా మారాయని తెలుసుకున్నాను. దాంతో నేను తిరిగి పాఠశాలకు క్రమం తప్పకుండా వెళుతున్నాను. నాకిప్పుడు చాలా సంతోషంగా ఉంది.''



– నవకృతి సింగ్, 14 ఏళ్లు.

## ఫోకస్

## ''విద్యార్థులను దండించే పాఠశాల ఉపాధ్యాయులకు హెచ్చరిక''

### పరిక్ చంద్రడేల్‌తో ఇంటర్వ్యూ:

విద్య అనేది పిల్లలందరి ప్రాథమిక హక్కు. కానీ దీనికి బదులుగా దేశంలో చాలామంది పిల్లలు చదువుకు దూరమైపోతున్నారు. మరోవైపున, పాఠశాలలో శారీరకంగా, మానసికంగా ఇస్తున్న దండన కారణంగా అనేకమంది పిల్లలు మానసికంగా దెబ్బతింటున్నారు. కాని, మారుతున్న విద్యావ్యవస్థ పిల్లలను కొత్త పద్ధతులు, కౌశలాలతో వృద్ధి చేయడానికి ప్రయత్నిస్తోంది. దీన్ని వివరంగా తెలుసుకోవడానికి, కొంతమంది యువ విలేకరులు పాఠశాల ఇన్‌స్పెక్టర్ పరిక్ చంద్ర డోలెను కలుసుకునేందుకు వెళ్లారు. ఆ ఇంటర్వ్యూ సారాంశం ఇక్కడ చూడండి.

ప్ర. ప్రస్తుతం, మన విద్యావ్యవస్థ విద్యలో ఎలాంటి మార్పును తీసుకువస్తోందో చెబుతారా?

జ. మేం ఇప్పుడు అఖిల భారత విద్యావ్యవస్థను చేపడుతున్నాము. రాష్ట్ర సిబిఎస్ఇ నిర్దిష్ట పద్ధతి

తీసుకున్న తర్వాత ఎస్ఇబిఎ తుది నిర్ణయం తీసుకుంటుంది.

ప్ర. విద్యావ్యవస్థలో పిల్లల ప్రాథమిక హక్కుల సమస్యను పొందుపర్చడానికి మీరు ఎలాంటి చర్యలు చేపట్టారు?

జ. విద్య పిల్లల ప్రాథమిక హక్కు. 14 ఏళ్ల వరకు పిల్లలందరూ ఉచిత విద్య పొందాలి. బాలికల చదువుకు మరింత ప్రాధాన్యత ఇవ్వ వలసి ఉంటుంది.

ప్ర. పాఠశాలల్లో శారీరక, మానసిక శిక్షా పద్ధతులు ఇప్పటికీ కొనసాగుతున్నాయా? దీన్ని నిరోధించడానికి ఏ చర్యలు తీసుకున్నారు?

జ. శారీరకంగా శిక్షించడం సిగ్గుపడవలసిన అంశం. గాంధీజీ స్వప్నాన్ని సాకారం చేయడానికి, ఏ విద్యార్థినీ శారీరక, మానసిక దండనకు గురిచేయరాదని సుప్రీంకోర్టు ఆదేశించింది. కాబట్టి, విద్యార్థులను దండించరాదని ప్రతి పాఠశాల టీచర్‌నూ హెచ్చరించడమైంది. ఇందుకు సంబంధించి ఏ ఉపాధ్యాయుడైనా తప్పు చేశాడని తెలిస్తే అతడిని శిక్షిస్తాము.

ప్ర. పిల్లల సర్వతోముఖాభివృద్ధికి మీరు ఏం చేస్తున్నారు?



జ. సాధారణ విద్యతో పాటు జీవితంలో సమగ్ర విజయాలను సాధించడానికి గాను పిల్లలకు నైతిక పాఠాలు కూడా చెబుతున్నాము. వారికి ఎన్‌సిసి/స్కౌట్ గైడ్‌లుగా శిక్షణ ఇచ్చేందుకు కూడా ప్రయత్నిస్తున్నాము.

# విలువిద్యలో విజయం

డిబ్రూగర్ లోని డికోమ్ జటియా విద్యాలయకు చెందిన ఐదుగురు విద్యార్థులు చోకిడింగ్ మైదానంలో జూన్ 3 – 5 తేదీల మధ్య జరిగిన జిల్లా స్థాయి గ్రామీణ క్రీడల టోర్నీలో విలువిద్యా పోటీల్లో గెలువడం ద్వారా తమ పాఠశాలకు పేరు తెచ్చారు. బాలికల విభాగంలో ప్రథమస్థానంలో నిలిచిన జున్మోని బారువా ఇలా చెప్పింది.

''ప్రథమస్థానం సాధించగలనని నేను ఊహించలేకపోయాను. పోటీకి సిద్ధమవుతున్నపుడు మంచిగా ఆడమని మా స్నేహితులు కోరారు'' ఈ 13 ఏళ్ల వయసుగల ఏడో తరగతి విద్యార్థిని పాఠశాలలో స్ఫూర్తి పొందిన తర్వాత ఐదో తరగతినుంచే పాఠశాలలో శిక్షణ తీసుకోవడం మొదలెట్టింది. ప్రతి రోజూ ఉదయం వేళ ఆమె ఇంట్లోనే అభ్యాసం చేయసాగింది.

రాష్ట్ర విలువిద్యా క్రీడాకారిణి రంజుమోని బారువా అంత గొప్ప ప్లేయర్ కావాలని ఆమె కోరుకుంది. ఏడవ తరగతి విద్యార్థి ప్రియాంక దత్తా ఈ పోటీల్లో రెండో స్థానంలో నిలిచింది. ఈ పాఠశాలకే చెందిన మరో ఏడవతరగతి విద్యార్థి హిరన్ జ్యోతి బారువా కూడా రెండో స్థానంలో నిలిచాడు. ''డేవిడ్ షర్గిరాయ్ సర్ మాకు శిక్షణ ఇవ్వడమే కాక, ప్రతి శనివారం ఉదయం మాకు

విలువిద్యలో పాఠాలు చెప్పేవారు. ప్రతిరోజూ నేను అర్ధగంట ఇంట్లోనే అభ్యాసం చేసేవాడిని'' అని బారువా చెప్పాడు. ఆటలు చదువుపై ప్రభావం చూపవని చెప్పే ఈ యువ క్రీడాకారుడు స్ప్రింటింగ్, ఫుట్‌బాల్ వంటి ఆటలపై కూడా ఆసక్తి చూపుతుంటాడు.

భోగేశ్వర్ బారువా లాగా మంచి రన్నర్ అవ్వాలనుకుంటున్న హిరణ్య ప్రతిరోజూ మూడు, నాలుగు గంటల పాటు పరుగెడుతుంటాడు. ఈ పాఠశాల విద్యార్థులు సునీల్ రాయ్ (ఏడవ తరగతి) బితుపన్ బారువా (ఆరవ తరగతి)లు వరుసగా మొదటి, మూడో స్థానాలలో నిలిచారు.

– ఊర్భషి ఘర్వాలియా, 13 సంవత్సరాలు.

## 12 ఏళ్ల అనూ ఒక సంవత్సరం తర్వాత విద్యాహక్కును పొందనుంది.



12 ఏళ్ల అనూ నాయక్ కుటుంబం డిబ్రూగర్‌లోని మోహన్‌బారి టీ తోట బిఎఫ్ లైన్‌లో నివసిస్తోంది. ఈమె తన తల్లిదండ్రులు, ఏడుగురు సోదరీసోదరులతో కలిసి ఉంటోంది. ఆమె పాఠశాలకు పోలేదు. తద్భిన్నంగా ఆమె తన చిన తమ్ముడి బాగోగులు చూసుకుంటూ ఇంటివద్దే ఉండేది. ఏడుగురు అన్నా చెల్లెళ్లలో మూడవదైన అనూ ఇలా చెప్పింది.

''సాంఖ్యయోగి శిక్షా కేంద్రంలో నేను ఒకటో తరగతి చదివేదాన్ని. కాని, సంవత్సరం తర్వాత నేను స్కూలు వదలిపెట్టవలసి వచ్చింది. మా అమ్మానాన్నలు పనులకు వెళ్లిపోతే ఇంట్లో తమ్ముళ్లు, చెల్లెళ్లను నేనే చూసుకుంటున్నాను. నాకు చదువుకోవాలని ఉంది. అవకాశం వస్తే తప్పకుండా చదువుకుంటాను.''

ఈ విషయమై మేము ఆమె తండ్రి మదన్ నాయక్‌ను సంప్రదిస్తే అతడిలా సమాధానమిచ్చాడు. ''మా పాపను స్కూలుకు పంపలేనందుకు చాలా బాధపడుతున్నాం. కాని, తను బడికెళ్లిందంటే మాకు ఇంటివద్ద చాలా సమస్య అయిపోతుంది. ఆమె చిన్న తమ్ముడు మరికాస్త ఎదిగితే ఒక సంవత్సరం తర్వాత పాపను తప్పక బడికి పంపిస్తాము.''

– మార్జినా నాగ్, 21 సంవత్సరాలు.

Guwahati: Kasturba Gandhi National Memorial Trust, Assam Branch, Ulubari, Guwahati- 781007, ph- (o361) 2525534, Dibrugarh- Dikom Kasturba Labour Welfare Centre, Dikom, Dibrugarh, Assam. pin- 786101.
Published by Kasturba Gandhi National Memorial Trust, Gandhi Smriti and Darshan Samiti and UNICEF., email- muktaakash33@gmail.com



# ఉన్నతుడు



కర్పూర దేశాన్ని పాలించే మాణిక్యవర్మ ఆస్థానంలో, గంగాధరమిశ్రుడనే కవి ఉండే వాడు. ఆయన రాజుకు బాల్యమిత్రుడు. ఎన్నో చక్కని కావ్యాలు రాసి, సాహిత్య ప్రియుడైన మాణిక్యవర్మకు మరింత సన్నిహితుడయ్యాడు. సాహిత్య సంబంధ విషయంలో మహారాజు గంగాధరమిశ్రుడిని సంప్రదించకుండా ఏ నిర్ణయమూ తీసుకోడని కూడా పేరుపడ్డది. అలాగని రాజ్యాధీశుడు తన పట్ల చూపుతున్న గౌరవాదరణను గంగాధరమిశ్రుడు ఏనాడూ స్వప్రయోజనాల కోసం దుర్వినియోగపర్చలేదు.

ఇది ఇలా ఉండగా, ఒకసారి మాణిక్యవర్మ రానున్న తన జన్మదినోత్సవం నాడు, రాజ్యంలోని ఒక గొప్ప కవిని మాన్యాలూ, అగ్రహారాలూ ఇచ్చి సన్మానించాలనుకున్నాడు.

ఆ సన్మానం ఎవరికి జరిగేదీ తన జన్మదినోత్సవానికి కొంచెం ముందుగా మాత్రమే తెలియ చేయబడుతుందని ప్రకటించాడు.

ఇది జరిగిన కొద్ది రోజుల తరవాత, ఒక నాడు గంగాధరమిశ్రుడు తన ఇంట కొందరు కవిమిత్రులతో గోష్ఠి జరుపుతూండగా, సుధాకరుడనే పండితుడు కల్పించుకుని ''విరించి పట్టణంలో ఉండే స్వర్ణకుంతలుడనే కవిని మన మహారాజు ఈ ఏడు సన్మానించదలచినట్టు నాకు తెలిసింది. ఈ సంగతి ఆయనకు తెలియచేస్తూ, తన జన్మదినం నాటికి ఆస్థానానికి రావలిసిందిగా మహారాజు స్వయంగా మనిషి ద్వారా కబురు చేశాడు,'' అన్నాడు.

''ఇది నమ్మశక్యంగా లేదు. మహారాజు సన్నిహితుడైన గంగాధరమిశ్రుడికే తెలియని సంగతి. నీకు తెలియడం ఆశ్చర్యంగా ఉన్నది,'' అన్నాడొక కవి.

''మహారాజు గారు విరించి పట్టణానికి పంపిన భటుడి భార్య, మా ఇంటపని చేసే దాసీకి స్నేహితురాలు. ఈ సంగతి ఆమె ద్వారా నాకు తెలిసింది.'' అన్నాడు సుధాకరుడు.

జొన్నలగడ్డ రత్న

ఇష్టాగోష్ఠి సందర్భంగా ఈ వివరాలు విన్నాక గంగాధర మిశ్రుడికి చెప్పరానంత ఆవేశం కలిగింది.

కవులంతా వెళ్ళిపోయాక, ఆయన రాజు మాణిక్యవర్మ దగ్గిరకు వెళ్ళి, ''తమరు జన్మ దినోత్సవంనాడు సత్కరించబోయే కవి విషయంలో ఒక నిర్ణయానికి వచ్చినట్టు నగరంలో వదంతి లేచింది. ఆ ఘనుడైన కవి ఎవరో నేను తెలుసుకోవచ్చా?'' అని అడిగాడు.

మాణిక్యవర్మ మందహాసం చేస్తూ, ''నా ప్రాణమిత్రుడివైన నీకు, ఈ విషయం ముందే తెలియచెయ్యవలసింది! అయినా ఇదేమంత పెద్ద విషయం కాదని ఊరకుండిపోయాను. విరించి పట్టణంలో ఉండే స్వర్ణకుంతలుడనే కవిని ఈ పర్యాయం సత్కరించదలిచాను.'' అని అడిగాడు.

గంగాధరమిశ్రుడు ఒకటి రెండు క్షణాలు మౌనంగా ఊరుకుని, ''ప్రభూ, ఇప్పటికే ఈ సత్కారం నాకే లభిస్తుందని, నగరంలో అంతా విశ్వసించారు. తమ నిర్ణయాన్ని ప్రశ్నించడం కాదు: తమ వద్ద నాకు గల చనువుకొద్దీ అడుగుతున్నాను. ఈ సత్కారం నాకు జరగక పోవడానికి గల కారణం తెలుసుకోవచ్చా?'' అన్నాడు.

మాణిక్యవర్మ పెద్దగా నవ్వి, 'నేను ఒక కవి వ్యక్తిగత ప్రతిభను, మరొక కవితో పోల్చి, ఈ నిర్ణయానికి రాలేదు. నువ్వు నా దృష్టిలో ఎన్నటికీ మహాకవివే. ఆ విషయంలో ఎలాంటి సందేహమూ లేదు. నాకు స్వర్ణకుంతలుడు రాసిన కొన్ని కావ్యాలు చదివే అవకాశం కలిగింది...



అతడు ప్రతిభావంతుడైన కావ్యకర్త. అలాంటివాడు రాజాశ్రయం కోరక ఇన్నాళ్ళుగా ఏదో ఒక మారుమూల పట్టణంలో కాలం గడుపుతున్నాడు. తన ప్రతిభాపాటవాలను బహిర్గతం చేయకుండా గుప్తంగా దాచుకున్న అతణ్ణిసన్మానించడం, రాజుగా నా కనీస బాధ్యత అనిపించింది,'' అన్నాడు.

గంగాధరమిశ్రుడు ఏదో చెప్పబోతుండగా, ఒక భటుడు అక్కడికి వచ్చి, ''మహాప్రభూ, విరించి పట్టణం నుంచి వచ్చిన స్వర్ణకుంతలుడనే ఆయన, తమ దర్శనం కోరుతున్నాడు,'' అన్నాడు.

ఆ వెంటనే గంగాధరమిశ్రుడు, ''చూశారా, ప్రభూ! ఏ అగ్రహారాలో లభించబోతున్నవని తెలియగానే, ఆ కవి ఎంత హుటాహుటిన నగరానికి వచ్చాడో,'' అన్నాడు హేళనగా.

మాణిక్యవర్మ భటుడితో, స్వర్ణకుంతలుడిని లోపలికి పంపవలసిందిగా ఆజ్ఞాపించాడు.

అతడు రాగానే రాజు, ''మీరు హడావుడిగా ఇంత దూరప్రయాణం చేసి నగరానికి రావడం దేనికి? సన్మానానికి ఇంకా పక్షం రోజుల వ్యవధి ఉన్నది కదా! ఆ సంగతి మేము పంపిన భటుడు మీకు సరిగా చెప్పలేదా?'' అని అడిగాడు.

ఆ ప్రశ్నకు స్వర్ణకుంతలుడు ఒక్కసారిగా నివ్వెరపోయాడు. తర్వాత కాస్త తేరుకుని ''మహారాజా! నా రాక ఏదైనా అపార్థం కలిగిస్తే, క్షమించండి. అంత దూరం నుంచి నేను వచ్చిన కారణం ఈ సన్మానం నాకెందుకు చేయబోతున్నారో, మీ సమక్షంలో తెలుసు కుందామని,'' అన్నాడు.

ఈ ప్రశ్న విని మాణిక్యవర్మ ఆశ్చర్యపోయి, ''ఈ లోకంలో సన్మానం తనకెందుకు చెయ్య లేదో తెలుసుకోవాలనుకునే వారుండటం సహజం. కాని, సన్మానం నా కెందుకు చేస్తు న్నారు అని ముందుగానే ఎదురు ప్రశ్నించే, మీబోటి వారి గురించి ఏమనుకోవాలో, నా కర్థం కావడం లేదు!'' అన్నాడు.

అప్పుడు స్వర్ణకుంతలుడు వినయంగా, ''ప్రభూ, గంగాధరమిశ్రుడి వంటి ప్రసిద్ధుడైన మహాకవి, మీ ఆస్థానంలో ఉన్నాడు. నేను అనామకుణ్ణి, పైగా తమకు అపరిచితుడిని, అటువంటి నన్ను మీరు సన్మానించబోతు న్నారు. ఇందుకు తమరు చెప్పే కారణా లేమిటో నాకు తృప్తి కలిగించితే తప్ప లేకపోతే ఈ సన్మానానికి నేను ఏ మాత్రం అంగీకరించ లేను,'' అన్నాడు.

మాణిక్యవర్మ దీనికి ఏం జవాబివ్వడమా అని ఆలోచిస్తున్నంతలో, గంగాధరమిశ్రుడు స్వర్ణకుంతలుడితో, ''మీరు మహాకవిగా అభి వర్ణిస్తున్న ఆ గంగాధరమిశ్రుడిని నేనే! కవిగా మీ ప్రతిభ నేను ఎరుగను. కాని, మహా రాజుగారి సమక్షంలో, మీరు వెలువరించిన అభిప్రాయాలను స్వయంగా వినడం ద్వారా, నాకన్న మీరు ఉన్నతులని గ్రహించాను. అందువల్ల, మీరే రాజుగారి సన్మానానికి నిజ మైన అర్హులు!'' అన్నాడు.

మాణిక్యవర్మ, గంగాధరమిశ్రుడి మాటలు విని పరమానందం చెందాడు. ఆ తర్వాత ఆయన తన జన్మదినోత్సవం నాడు స్వర్ణ కుంతలుడితో పాటు, గంగాధరమిశ్రుడిని కూడా ఘనంగా సత్కరించాడు.



# అట్టమీది బొమ్మ

బృందావన ప్రజలు ఒకప్పుడు, ఇంద్రునికి యజ్ఞం చేయాలని సన్నాహంలో ఉన్నారు. అది చూసి శ్రీకృష్ణుడు నందునితో, నాయనా! ఈ హడావుడి అంతా ఏమిటి అని అడిగాడు.

అందుకు నందుడు, ''బిడ్డా! వర్షానికి అధిపతి ఇంద్రుడు, ఆయనకు యజ్ఞం చేసి సంతోషపెట్టామంటే, వానలు కురిపిస్తాడు. వానలు కురిస్తే పంటలు పండుతై. పంటలు పండితే ప్రజలు సుఖిస్తారు.'' అని బదులు చెప్పాడు. ఇది విని శ్రీకృష్ణుడు, ''ఇదేమిటి ఈ అవివేకం! గోవులూ, పర్వతరాజు ఐన గోవర్ధనగిరి, ఇవే మన దేముళ్ళు. వీటినే మనం పూజించుకోవాలి. అంతే గాని, ఎక్కడో ఉన్న ఇంద్రుడికి యజ్ఞం చేయడమా? ఆయన మనకు యజ్ఞం కురిపించడమా? ఆయన మనకు వర్షం కురిపించడమా?'' అని వారిని నిరుత్సాహపరిచాడు.

ఈ విధంగా తన యజ్ఞం మాన్పించేవరకు, ఇంద్రునికి మండుకొచ్చి, బృందావన ప్రజలకు శాస్తి చేయాలని, నిశ్చయించుకున్నాడు. అతని ఆజ్ఞ ప్రకారం, ఆకస్మికంగా మేఘాలు కమ్మేసి, ఉరుములతో, మెరుపులతో, పిడుగులతో, పెనుగాలితో ఘోరమైన వడగండ్ల వాన ప్రారంభించింది. ఆ పెనువర్షం ధాటికి ద్వారకా నగరం అల్లల్లాడిపోయింది. ఈ ఆకస్మిక ఉత్పాతాన్ని చూసి నగర ప్రజలు భీతిల్లిపోయారు.

అప్పుడు అవతారమూర్తి ఐన కృష్ణుడు బ్రహ్మాండమైన గోవర్ధనగిరిని చేతి చిటికెనవేలితో, గొడుగు ఎత్తినట్లు అవలీలగా ఎత్తి పట్టుకొని, ప్రజలతో మీకు వచ్చిన భయమేమీ లేదు. ఇలా వచ్చేసేయండి. ఇంద్రుడు ఏమి చేయగలడో చూస్తానంటూ అందరినీ కొండకిందికి చేరదీసుకున్నాడు.

ఈ భీభత్సం ఏడు రోజులపాటు సాగించగలిగాడు ఇంద్రుడు. గోవర్ధనగిరి కదలకుండా కృష్ణుడు అలానే పట్టి ఉంచే సరికి, ఇంద్రుడు భూలోకానికి దికివచ్చి, కృష్ణుని పాదాలమీద పడి క్షమాపణ కోరుకున్నాడు. అంతటితో అధికారగర్వంతో మిడిసిపడుతూ ఉన్న ఇంద్రునికి గర్వపరిహారమైంది.



# చలమయ్య గోదానం



నాగవరం గ్రామంలో ఉండే చలమయ్యకు డబ్బు కాపీనం ఎక్కువ. ఆయనకొక సారి జబ్బు చేసింది. అది ఏ మందులకూ లొంగ లేదు. చలమయ్య తల్లి శాంతమ్మ, ఆయనతో ''చచ్చి స్వర్గాన ఉన్న నీ నాయనకూ, ఒకసారి ఇలాంటి జబ్బే చేస్తే, సద్బ్రాహ్మణుడొకా యనకు గోదానం చేశాడు. వెంటనే తగ్గిపో యింది.'' అన్నది.

''నా జబ్బుకూ, గోదానానికీ సంబంధం ఏమిటమ్మా?'' అన్నాడు చలమయ్య. అంత జబ్బులోనూ, ఒక ఆవును వదులుకోవడం అన్నమాట, ఆయనకు దిగులు పుట్టించింది.

''ఒరే, మనం చేసిన పాపాలే జబ్బుల రూపంలో మనను బాధిస్తాయి. అంటే, జబ్బు మనను పుణ్యకార్యాలేమైనా చేయమని హెచ్చ రిస్తుందన్నమాట! నీ సంగతి నాకు తెలియని దేముంది? డబ్బు కూడగట్టడమే తప్ప, ఎవ రికీ సాయపడి ఎరుగవు. అంతా మీ నాయన పోలిక,'' అన్నది శాంతమ్మ.

చలమయ్య భార్యాపిల్లలు కూడా ఆయ నను తల్లి చెప్పినట్టే చేయమని బలవంత పెట్టారు. చివరకు చలమయ్య రామశర్మ అనే బ్రాహ్మణుణ్ణి పిలిపించి, ఒక చూడి ఆవును దానం చేసి, ''బ్రాహ్మణోత్తమా! ఆవు ఈన గానే, దాన్ని మీరు ఉంచుకుని దూడను నాకు ఇవ్వాలి. దూడతో, మీకేం పని ఉండదు గదా,'' అన్నాడు.

రామశర్మ కంగారు పడి, ''అయ్యా, తల్లినీ, బిడ్డనూ వేరు చేయడం, మహా పాపం గదా!'' అన్నాడు.

''గోన్యాయం వేరు; మానవ న్యాయం వేరు. మీరనే న్యాయం, మానవులకే గాని పశువులకు వర్తించదు. అయినా, దూడను మీరు వెంటనే నాకివ్వనవసరం లేదు. దానికి తల్లి అవసరం తీరాకనే,'' అని చెప్పాడు చలమయ్య. రామశర్మ సరేనని, ఆవును తోలుకుపోయాడు. ఆ మర్నాటికి చల మయ్య జబ్బు చేత్తో తీసినట్టు మాయమై

**25** ఏళ్ళనాటి చందమామ కథ

పోయింది. కొద్ది రోజుల తర్వాత, చలమయ్య ఎప్పటి మనిషై పోయాడు.

కొన్నాళ్లకు చలమయ్య దానం చేసిన ఆవు ఈనింది. దానికొక కోడె దూడ పుట్టింది. ఈ సంగతి తెలిసినప్పటినుంచి చలమయ్య మనసు, మనసులో లేదు. అవు తనది కాక పోయినా, దూడ తనదే కాబట్టి, దాన్ని చూడా లన్న వంకతో, రోజుకొకసారైన, ఆయన రామశర్మ ఇంటికి వెళ్లి, ఆవును చూసుకుం టూండేవాడు. ఈ విధంగా వారం రోజులు గడిచినై. ఒక రోజున చలమయ్య ఉండ బట్టలేక, రామశర్మను, ''బ్రాహ్మణోత్తమా! ఆవు పాలు సక్రమంగా ఇస్తున్నదా?'' అని అడిగాడు.

''అయ్యా, ఇది దేవతాంశ గల ఆవు. రోజుకు నాలుగుశేర్ల పాలిస్తున్నది,'' అని చెప్పాడు రామశర్మ. స్వతహాగా రామశర్మ మొహమాటస్థుడు. ఆయన చలమయ్యను సంతోష పెట్టాలనుకుని, ఆవు ఇస్తున్నదానికి రెండు శేర్లు ఎక్కువ చెప్పాడు.

ఇది వింటూనే చలమయ్యకు గుండె ఆగినట్లయింది. తనకున్న ఆవుల్లో, ఏ ఒకటీ అన్ని పాలివ్వదు.

''బ్రాహ్మణోత్తమా! ఆవు అంత ఎక్కువగా పాలిస్తున్నదంటే, అవి ఏమంత రుచిగా ఉండ వనుకుంటాను,'' అన్నాడు చలమయ్య.

రామశర్మ పాలు రుచిగా లేవంటే, చలమ య్యకు కొంత తృప్తిగా ఉండేది. అలా కానప్పుడు చాలా మంచి ఆవును దానం పేరుతో పోగొట్టుకున్నానన్న బాధ చలమ య్యను వదలదు. కాని, రామశర్మ ఎంతో



కృతజ్ఞతగా ''అయ్యా, మంచిమనసుతో, మీరిచ్చిన ఈ ఆవు పాల రుచి, మాటల్లో వర్ణించలేను. బహుశా దేవతలు సేవించే అమృతం, ఆలాగే ఉంటుందేమో!'' అన్నాడు.

చలమయ్య వెంటనే ''అలాగైతే, ఈ ఆవు పాలరుచి చూడాలని, నాకు కోరికగా ఉన్నది.'' అన్నాడు. రామశర్మ, అప్పటికప్పుడు ఆయ నకు ఒక లోటాలో వేడి పాలు తెప్పించి ఇచ్చాడు. చలమయ్య, ఆ పాలు తాగాడు. చాలా బాగున్నవి.

చలమయ్య దిగులుతో ఇంటికి వెళ్లి పోయాడు. ఆ రాత్రంతా ఆయనకు నిద్ర పట్టలేదు.

మర్నాటి ఉదయం నిద్రలేస్తూనే, ఆయన రామశర్మకు కబురు పెట్టి, ''బ్రాహ్మణోత్తమా! నేనొకరకమైన అనారోగ్యంతో బాధపడుతు న్నాను. నిన్న మీ ఇంట పాలు తాగగానే ఎంతో గుణం కనబడింది. నిజంగానే, ఆ



ఆవులో, దేవతాంశ ఉన్నదనిపిస్తున్నది. ఆ పాలలో అమృతం ఉన్న లక్షణాలు కనిపిస్తున్నవి. మీరది ప్రతిదినమూ నాలుగు శేర్ల పాలిస్తున్నదన్నారు కాబట్టి, అందులో రెండు శేర్ల పాలు నాకివ్వగోర్తాను. నా ఆరోగ్యం బాగయ్యేవరకూ మాత్రమే ఇలా ఇవ్వండి!'' అని చెప్పాడు.

ఇది విని రామశర్మ గుండెల్లో రాయి పడినట్టయింది. కాని, ఆయన ఏమీ అనలేక, చలమయ్యతో సరేనని చెప్పి, ఇంటికి వెళ్లిపోయాడు. శాంతమ్మ కొడుకును మందలిస్తూ, ''గోవును దానం చేసి దాని పాలు తీసుకుంటే పుణ్యం దక్కదురా!'' అన్నది.

''పుణ్యం దక్కకపోతే, నా జబ్బు తిరిగి రావాలి గదా? అలా జరగలేదు కాబట్టి, నన్నేపాపమూ అంటలేదు. వచ్చిన పుణ్యం పోనూ లేదు,'' అన్నాడు చలమయ్య. ఆ రోజు నుంచీ రామశర్మ ఆవును తాను పోషిస్తూ, అది ఇచ్చిన పాలన్నీ క్రమం తప్పకుండా చలమయ్యకు పంపిస్తూ వచ్చాడు.

ఇలా కొంత కాలం తిరిగేసరికి, చలమయ్యకు మళ్లీ జబ్బు తిరగబెట్టింది. ఆయన హడలిపోయి, వెంటనే రామశర్మ దగ్గిర్నుంచి, పాలు తీసుకోవడం మానేశాడు. అయినప్పటికీ, ఆయన జబ్బు తగ్గలేదు. వైద్యుడు వచ్చి మందిస్తున్నాడు. కాని, ఆ మందు ఏమాత్రం పనిచేయడం లేదు.

రామశర్మ నుంచి పాలు తీసుకోవడం మానేశాను కాబట్టి, నాకు గోదానం చేసిన పుణ్యం దక్కాలి. అయినా నా జబ్బెందుకు తగ్గడం లేదు - అని మథనపడ్డాడు చలమయ్య. ఒకనాడు చలమయ్య ఇంటి ముందు సాధువొకడు నిలబడి, ''ఇంట్లో పాపముంది, నివారించుకోండి,'' అని కేక పెట్టాడు.

ఇది విని శాంతమ్మ సాధువును లోపలకు పిలిచి, కొడుకును చూపించింది.

సాధువు, చలమయ్యను పరీక్షగా చూసి, ''నీకు గోదానం చేసిన పుణ్యం రాలేదు. పైగా, పాలు దొంగతనం చేసిన పాపం చుట్టుకున్నది!'' అన్నాడు.

చలమయ్య దీనంగా, ''స్వామీ, అలా ఎందుకు జరిగింది? దానిలో ఉన్న రహస్యం ఏమిటి? నేను దానం చేసిన ఆవు ఇచ్చే పాలతో, సద్బ్రాహ్మణుడైన రామశర్మ సుఖిస్తున్నాడు గదా!'' అన్నాడు.

అందుకు సాధువు, ''ఓయీ, నీవంటి డబ్బుకాసిన జీవులకు, నిదర్శనాలు ఆ భగవంతుడే చూపుతుంటాడు. గోదానం

చేసిన పుణ్యం తక్షణమే సంజీవనిలా పనిచేసి, నీ జబ్బు తగ్గిపోయింది. ఈ నిదర్శనం కారణంగా - నీవు బుద్ధిగలవాడివైతే, దానం చేయడం వల్ల పుణ్యం వస్తుందన్న నమ్మకం కలగాలి. కాని, అలా జరగలేదు. జబ్బు తగ్గగానే, వంచనా బుద్ధితో, ఆవు పాలను రామశర్మ నుంచి హరించడం మొదలు పెట్టావు. జబ్బు తిరగబెట్టింది. ఇది తగ్గితే, మళ్లీ పాలడుగుతావని రామశర్మ భయ పడుతున్నాడు. ఆ సద్బ్రాహ్మణుడి భయమే, నీకు జబ్బు తగ్గకుండా చేస్తున్నది!'' అని చెప్పాడు.

''అయితే, ఇప్పుడు నేనేం చెయ్యాలి స్వామీ!'' అని అడిగాడు చలమయ్య విల విల్లాడిపోతూ. ''పాల దొంగతనం మహా పాపం! ఆ పాపం నిన్నంటింది. దాని నుంచి విముక్తుడివి కావడానికి, నువ్వు మరొక గోదానం చేయాలి. అదీ ఒకపుణ్యాత్ముడికి!'' అన్నాడు సాధువు.

''అలాగే ఆ గోదానమేదో మీకే చేస్తాను,'' అన్నాడు చలమయ్య. ''నేనెవరికీ దాన ధర్మాలు చేయలేదు. అందువల్ల, నేను పుణ్యాత్ముణ్ణనిపించుకోను,'' అన్నాడు సాధువు. ''అలా అయితే, ఆ పుణ్యాత్ము డెవరో తమరే సెలవివ్వండి, స్వామీ!'' అన్నాడు చలమయ్య.

''ఈ గ్రామంలో, ఇప్పుడందరిలోకీ, రామ శర్మ పుణ్యాత్ముడు. ఆయనకు పాలను దానం చేసిన పుణ్యం వచ్చింది.'' అన్నాడు సాధువు. చలమయ్య తెల్లబోయాడు.

సాధువు నవ్వి, ''నువ్వు గోదానం చేసిన ప్పుడు, ఆ దానం పట్టినవాడు పాలెవరికైనా దానం చేస్తే, ఆ పుణ్యం కూడా నీకే దక్కేది. కాని, రామశర్మ, నీకు పాలివ్వడం వల్ల, నీకు పాల దొంగతనం పాపం, ఆయనకు దానం చేసిన పుణ్యం దక్కాయి. అంత చేదు అనుభవం తరవాతనైనా, నీ డబ్బు కాపీనం వదిలి పెట్టు!'' అని సలహా ఇచ్చాడు.

చలమయ్య, సంతానంతో సహా, రెండా వులూ రామశర్మవేనని హామీ ఇచ్చి, తన తప్పు క్షమించమన్నాడు.

ఆ తర్వాత చలమయ్య జబ్బు తగ్గిపో యింది. ఆయన మనస్ఫూర్తిగా దానధర్మాలు చేస్తూ, సుఖంగా జీవించాడు.



# కెరీర్ అంటే?



మీరీ ప్రశ్నను ఎన్నిసార్లు విని ఉంటారు? దీనికి ఏమని సమాధానం చెప్పాలో నాకయితే తెలియడం లేదు! ఎంచుకోవడానికి చాలా సమాధానాలే ఉంటాయి: లా చదవడం, వస్తువులను తయారుచేసి, అమ ర్చడం, సంగీతం, కళలు, వైద్యం, డబ్బు నిర్వహిం చడం, ఇలా చెపుతూ పోతే జాబితాకు అంతం ఉండదు.




నా పేరు సాయి. నా వయస్సు 15 సంవత్సరాలు. ఈ నెలనుంచి మనం కెరీర్‌కి సంబంధించి అందుబాటులో ఉన్న పలు విష యాలను, మన నైపుణ్యాలకు తగిన అవకాశాలను కూడా చర్చించుకుం దాము.

మొదలు పెట్టడానికి ముందు, ఉద్యోగం, పని, కెరీర్ అనే పదాల గురించి నేను తెలు సుకున్న విషయాన్ని మీకు చెప్పనివ్వండి. ఈ మూడు పదాల అర్థం ఒకటే అనిపిస్తుంది. అలా అనిపించకపోతే వాటి అర్థాలు కింద చూడండి.

పని : ఇది చేయవలసిన చర్య. మనం చేయగలిగిన ప్రతిదీ పనే. బకెట్ ఎత్తిపెట్టడం, ఏదైనా వస్తువును అందించడం, కారు నడపడం, సొరుగుకు పెయింట్ చేయడం.. ఇలాంటి పనుల న్నింటినీ పని అని చెప్పవచ్చు.

ఉద్యోగం : వ్యక్తి తన ఆఫీసులో కూర్చుని చేయగలిగిన పనులన్నింటికీ జాబ్ అని పిలుస్తారు. ఉదాహరణకు, నేను ఉపాధ్యాయుడిని అయితే, బోధనా పనులతో పాటు నేను పాలనాపరమైన పనిచేస్తాను, వర్క్‌షాపులను సాంస్కృతిక కార్యక్రమాలను నిర్వహిస్తాను.

కెరీర్ : ఇది నన్ను నిర్వచించేది. ఏదైనా కెరీర్‌ని నేను నిర్ణయించుకునేటప్పుడు, మనం జీవితం ఎలా ఉండాలనుకుంటున్నాము, మనం ఎక్కడ చదవాలని, పనిచేయాలని అనుకుంటు న్నాము, మనం ఏ సామాజిక ప్రతిపత్తిని పొందాలనుకుంటున్నాము వంటివి కెరీర్ కిందికి వస్తాయి. కెరీర్ అంటే మనకు డబ్బు తెచ్చిపెట్టే ఉద్యోగం మాత్రమే కాదు. ఇది మనకు వ్యక్తి త్వాన్ని, ప్రతిష్టను గుర్తింపును అందించేది. జీవితంలోని ఒక దశనుంచి మరో దశకు మనం చేరే పురోగతినే కెరీర్ అనవచ్చు. పాఠశాల నుంచి విశ్వవిద్యాలయానికి తర్వాత ఉద్యోగాలకు ఎలా వెళ్లాలి అనే దాన్ని నిర్ణయించేదే కెరీర్.

మరోసారి మనం కలుసుకునేటప్పుడు, ఈరోజు మనకు అందుబాటులో ఉన్న కెరీర్ అవకాశాలను, వాటికోసం మనకు అవసరమైన కౌశలాలను తెలుసుకుందాం. అంత వరకు ఎలాంటి సమస్యలూ లేకుండా ఉండండి.

– సాయి





# భారతదర్శిని

## ఓటు వేయడం మరవని వీరుడు




సిమ్లా సమీపంలోని జాగ్వార్ నివాసి భడరుకు 127 ఏళ్లు. బ్రిటిష్ సామ్రాజ్యం ప్రజాస్వామ్యం, ప్రపంచీకరణ.. మన చరిత్రలోని అన్ని ఘటనలకు ఈయన ప్రత్యక్ష సాక్షి! భడరు ఈనాటికీ ప్రజాస్వామ్యానికి కట్టుబడ్డారు. ఇంతవరకు తాను ఓటు వేయకుండా పోయిన సందర్భం లేదు. 1952 నుంచి ఈయన ఓటు వేస్తూనే ఉన్నారు.

ఎన్నికల కమిషన్ గణాంకాల ప్రకారం బడరు హిమాచల్ ప్రదేశ్ లోనే కాకుండా దేశం మొత్తంలోనే అతి వృద్ధ ఓటరుగా నమోదయ్యారు.

జన్మదిన నమోదు ఆరోజుల్లో తప్పనిసరి కాదు కాబట్టి ఈయనకు జన్మదిన ధ్రువీకరణ పత్రం లేదు. ఈ శతాధిక పురుషుడికి మన వ్యవస్థమీద ఉన్న విశ్వాసానికి మనం జోహార్లర్పించవలసిందే.

## బడికెళ్లాలంటే నది దాటాలి

సాహస క్రీడలపట్ల మీకు ఆసక్తి ఉన్నట్లయితే రివర్ క్రాసింగ్ గురించి మీకు తెలిసే ఉంటుంది. కానీ కొంతమంది పిల్లలకు నది దాటడమంటే ఆట కాదు. రోజూ బడికి వెళ్లాలంటే వారు తప్పనిసరిగా దాటవలసిన మార్గం. భోపాల్ సమీపంలోని నరెలా హనుమంత్ గ్రామం పిల్లలకు ఇది నిత్య కృత్యంగా ఉంటోంది. పక్క ఊరి బడికి వెళ్లాలంటే ఈ పిల్లలకు నది అడ్డం వస్తుంది. ఈ సమస్య పరిష్కారానికి గ్రామస్థులు, నదికి అడ్డంగా రెండు ఇనుపతీగలు కిందా పైనా ఉండేలా కట్టారు. పిల్లలు ఒకతీగపై కాలు పెట్టి నడుస్తూ ఊతం కోసం మీటరు ఎత్తులో ఉన్న మరో తీగను పట్టుకుంటారు. బడికి వెళ్లాలంటే ప్రతి రోజూ ఈ తరహా గారడీపనులు చేయవలసిందే.




ఇది చాలా ప్రమాదంతో కూడుకున్నదే అయినప్పటికీ స్థానిక యంత్రాంగం పిల్లలకు సురక్షితమైన చోటును కల్పించలేకపోతోంది కనుక వీరికి మరో అవకాశం లేదు.



# మన దేశభాషలు నేర్చుకుందాం

ఈ జాబితాలో మొదట మీకు తెలిసిన భాషలలోని పదాలను చదవండి. ఆ తరవాత వాటి కింద ఇచ్చిన పదాలను అనుసరించి ఆయా భాషలలో ఆ పదాల ఉచ్చారణలనూ, అర్థాలనూ నేర్చుకోడానికి ప్రయత్నించండి.

| English | It is hot outside | Let's play |
|---|---|---|
| Hindi | బయట చాలా వేడిగా ఉంది. | ఆటాడుదాం రండి. |
| Telugu | बाहर बहुत गर्मी है।<br>బాహర్ బహుత్ గర్మీ హై. | आओ खेलें।<br>ఆవో ఖేలేం. |
| Tamil | வெளியில் அனலாக உள்ளது.<br>వెలియిల్ అనలాగా ఉళత్తు. | நாம் விளையாடலாம்.<br>నామ్ విలైయాడలామ్. |
| Bengali | বাইরে গরম।<br>బాయిరె గరోమ్. | চলো খেলি।<br>చలో ఖేలి. |
| Marathi | बाहेत गर्मी आहे.<br>బాహెత్ గర్మీ ఆహె. | चला खेळूया.<br>చలా, ఖేలుయా. |
| Kannada | ಹೊರಗೆ ತುಂಬಾ ಬಿಸಿಯಾಗಿದೆ<br>హొరగె తుంబా బిసియాగిదె. | ಬನ್ನಿ ಆಡೋಣ<br>బన్ని ఆడోణ. |
| Oriya | ବାହାରେ ଭାରି ଗରମ ହେଉଛି।<br>బాహారె భారి గరమ హెచ్చి. | ଚାଲ, ଖେଳିବା।<br>చలా, ఖెలిబా. |
| Gujarati | બહાર ગરમી છે.<br>బహార్ గరమీ ఛె. | ચાલો રમીએ.<br>చాలో రమీయె. |
| Assamese | বাহিৰত বৰ গৰম।<br>బహిరట్ బర్ గరమ్. | আমি খেলোগৈ ব'লা।<br>ఆమి ఖెలొగే బలా |
| Malayalam | പുറത്ത് നല്ല ചൂടാണ്.<br>పురథు నల్ల చూడను. | നമുക്ക് കളിക്കാം.<br>నముక్కు కలిక్కమ్. |
| Santali | ᱵᱟᱦᱮᱨᱮ ᱟᱰᱤ ᱥᱤᱛᱩᱝ ᱠᱟᱱᱟ।<br>బాహారె ఆడి సిటుంగ్ కానా. | ᱫᱮᱞᱟ ᱵᱚ ᱮᱱᱮᱡ-ᱟ।<br>డెలా బొ ఎనెజ్-అ |
| Sanskrit | बहिरह तीव्र तापः अस्ति.<br>బహిరహ తీవ్ర తాపః అస్తి. | खेलनाय आगम.<br>ఖేలనాయ్ ఆగమ్. |
| French | Il fait chaud dehors<br>ఇల్ ఫే షో డెహోర్స్ | Allons jouer<br>అలోన్ జో-ఏర్ |
| German | Es ist heiß draußen.<br>ఎస్ ఇస్ట్ హైస్ డ్రౌస్సెన్ | wir wollen spielen.<br>వియర్ ఉల్లెన్ ష్పీల్లెన్. |
| Spanish | Hace calor fuera.<br>ఆస్ కలోర్ ఫ్యూయెరా. | Jugamos.<br>ఖుగామోస్. |





| English | Look at that flower | The river bends here |
|---|---|---|
| Hindi | ఆ పువ్వు కేసి చూడండి. | నది ఇక్కడ మలుపు తిరుగుతోంది. |
| Telugu | उस फूल को देखो।<br>ఉస్ ఫూల్ కో దేఖో. | नदी यहाँ से मुड़ती है।<br>నదీ యాహా సే ముఢతీ హై. |
| Tamil | அந்த மலரைப் பாருங்கள்.<br>అంధ మలరై పరుంగళ్. | நதி இங்கு வளைகிறது.<br>నధి ఇంగు వలైగిరత్తు. |
| Bengali | ঐ ফুলটা দ্যাখো।<br>ఒయి ఫూల్‌తే ద్యాఖో. | নদীটা এইখানে বেঁকে গেছে।<br>నదితే ఐయితానే బెంకె గచ్చె. |
| Marathi | ते फूल बघ.<br>తె ఫూల్ బఘ. | नदी इथून वळते.<br>నదీ ఇథూన్ వళతె. |
| Kannada | ಹೂವಿನತ್ತ ನೋಡಿ<br>హూవినత్త నోడి. | ನದಿಯು ಇಲ್ಲಿ ತಿರುಗುತ್ತದೆ<br>నదియు ఇల్లి తిరుగుత్తదె. |
| Oriya | ସେହି ଫୁଲଟିକୁ ଦେଖନ୍ତୁ।<br>సెహి ఫులటికు దెఖాంతు. | ନଦୀଟି ଏହିଠାରେ ବାଙ୍କି ଯାଇଛି।<br>నడిటి ఎహిథారె బాంకి జాచ్చి. |
| Gujarati | તે ફૂલ જુઓ.<br>తె ఫూల్ జువో. | નદી આ બાજુ વળે છે.<br>నదీ ఆ బాజు వళె ఛె. |
| Assamese | সেই ফুলটো চোৱাচোন।<br>గెయి ఫూలటో సొవాసొన్. | এইখিনি ঠাইত নদীখনে ভাঁজ লৈছে।<br>ఐయిఖిని థాయిట్ నడీఖనె భజ్ లొసె. |
| Malayalam | ആ പൂവ് നോക്കൂ.<br>ఆ పూవు నొక్కూ. | പുഴയ്ക്ക് ഇവിടെ വളവുണ്ട്.<br>పుళక్కు ఇవిడె వలవుండు. |
| Santali | ᱚᱱᱟ ᱵᱟᱦᱟ ᱠᱭᱚᱜ ᱢᱮ।<br>ఒనా బాహా కయాగ్ మే. | ᱱᱚᱸᱰᱮ ᱱᱟᱭ ᱠᱟᱰᱩᱵᱚᱝ ᱟᱠᱟᱱᱟ।<br>నొండె నాయి కాడుబంగ్ అకాన్నా. |
| Sanskrit | तत पुश्पम पश्य.<br>తత్ పుష్పమ్ పశ్య. | अत्रत नदी परावर्तते<br>అత్రత్ నదీ పరావర్తతె. |
| French | Regardes cette fleur<br>రిగార్డ్ సెట్ ఫ్లర్ | La rivière est déviée ici<br>లా రివియర్ ఎ డివియా ఎసి |
| German | Schauen Sie auf diese Blume<br>షావన్ జీహ ఔఫ్ దీజ్ బ్లుమ్ | Der Fluss biegt sich hier<br>డెర్ ఫ్లుస్ బీగ్ట్ సిష్ హీర్. |
| Spanish | Mira a la flor.<br>మీరా ఎ లా ఫ్లోర్. | El río se dobla aqui.<br>ఎల్ రియో సే డోబ్లా అకి. |





# కథల్లో జీవితపాఠాలు

క్రీ.పూ. 4 1 3, అశ్విని 2 3, మహిలారూప్య రాజ మందిరం

రాజమందిరం ఉపరిభాగంలోని మండువాలో వాళ్లు ఇద్దరూ నిల్చుని ఉన్నారు. గోడలపై పక్షులు, జంతువుల బొమ్మలను అద్భుతంగా చెక్కి ఉన్నారు. రాజమందిరం వెనుక భాగాన ఉద్యానవనం. ఎటు చూసినా పచ్చటి చెట్లు, పూల పొదరిళ్లు, విశాలమైన పచ్చిక బయళ్లు..

ఆ ప్రదేశం చాలా వరకు ప్రశాంతంగా ఉంది. సౌధోపరిభాగంలో నిల్చుని మాట్లాడుతున్న ఆ ఇద్దరి స్వర శబ్దాలు తప్పిస్తే అంతా ప్రశాంతం. పన్నెండు నుంచి పదిహేను సంవత్సరాల వయస్సు ఉన్న ముగ్గురు బాలురు దుమ్ముతో నిండిన పచ్చిక మీద దొర్లుతున్నారు. ముందుగా ఉత్సాహంతో మొదలైన వారి సరదా తర్వాత కేకల రూపంలోకి మళ్లింది. వాళ్లు ఒకరినొకరు తోసుకుంటూ కుమ్ములాడుకుంటున్నారు. రాజమందిర రక్షణకు నియమించిన నలుగురు అంగరక్షకులు అక్కడ నిలబడి వారిని విడదీయడానికి విశ్వ ప్రయత్నం చేస్తున్నారు.



''అటు చూడండి. వాళ్లెలా వ్యవహరిస్తున్నారో చూశారా? రోజంతా వీళ్లకు ఇదే పని,'' ఆజానుబాహుడైన ఆ వ్యక్తి ఉన్నట్లుండి అన్నాడు. ''బోధకులను నియమించి నేను విసిగిపోయాను. ఏ ఒక్కరూ వారిని క్రమశిక్షణలో పెట్టలేకపోయారు. ఐదునిమిషాల వ్యవధిలో వారు వీధి పిల్లల్లాగా కుమ్ములాడుకుంటుంటారు.''

కాషాయ వస్త్రాలు ధరించి నిరాడంబరంగా కనిపిస్తున్న వృద్ధుడు కళ్లు చురుకుగా అటూ ఇటూ కదులు తుండగా అన్నాడు. ''రాజకుమారులు ప్రాధమిక విద్య సాధించినట్లేనా ప్రభూ?''

మహిలారూప్య రాజ్యాధీశుడు అమరశక్తి తల ఊపాడు. ''అది క్షత్రియులుగా మేము వారికి అందించవలసిన కనీస విద్య కదా! కాని.. ఆచార్యా.. వారికి మరింత విద్య కావాలి. ఒకనాటికి మా పెద్ద కుమారుడు ఈ రాజ్యాన్ని ఏలాలి. అతడి ఇద్దరు సోదరులూ అతడికి సమర్ధవంతంగా పాలనలో తోడ్పడాలి. కాని వాళ్లకేసి చూడండి. వాళ్లు కనీసం రాజకుమారులుగా అయినా కనిపిస్తున్నారంటారా?''

కనిపించడం లేదని విష్ణుశర్మ అంగీకరించక తప్పింది కాదు. అయితే చాలా తెలివిగా సమాధానమిచ్చాడు. ''వారు చిన్న వయసులోనే ఉన్నారు ప్రభూ, వారికి విద్యాబుద్ధులు నేర్పవచ్చు. శిక్షణ గరపవచ్చు.'' ఉన్నట్లుండి రాజు ఆ వయోవృద్ధుడికేసి తిరిగి అతడి చేతులు పట్టుకున్నాడు.

‘‘ఆచార్యా, నా పుత్రులు రాజకుమారులుగా తయారు కావడానికి నేను ఈ ప్రపంచంలో ఏది చేయాలన్నా చేస్తాను. మీకు ఎంత కావాలి చెప్పండి. వంద గ్రామాలు కావాలా? లేక నేను నా జీవిత కాలంలో చూడనన్ని బంగారు నాణేలు సమర్పిం చాలా? చెప్పండి.’’

విష్ణుశర్మ నవ్వి, ‘‘మీ సహృదయతను, ఔదా ర్యాన్ని నేను అర్థం చేసుకోగలను మహారాజా, డబ్బుకు ఆశపడే వాణ్ణి కాదు నేను. ఆరునెలల్లోగా మీ కుమారులకు విద్య నేర్పకపోతే నా పేరు మార్చు కుంటాను!’’ అని శపథం చేశాడు.

* * *

క్రీ.పూ 413 పుష్య మాసం 25వతేదీ, వారణాసి.

విష్ణుశర్మ తన ముగ్గురు విద్యార్థులకేసి చూశాడు. రాజు అమరశక్తి తన పుత్రుల ప్రవర్తన గురించి చెప్పింది అంత వాస్తవం కాదేమో అనిపిస్తోందతనికి. ఎందుకంటే రాజు చెప్పినదానికంటే ఘోరంగా ఉన్నారు వారు.

వారణాసికి వెళ్లాలని నిర్ణయించింది మొదలు రాజపుత్రులు విక్రమ్, పురు, మను తీవ్రంగా వ్యతిరేకించారు. విష్ణుశర్మ ఆశ్రమంలోకి ఒకసారి ప్రవేశించిన తరవాత వారి రాజరికపు విలాసాలు కనుమరుగైపోయాయి. కాని వారు సకల జిత్తులూ ప్రయోగించారు. మొరాయించారు. పవిత్రమైన గ్రంథాలు, శాస్త్రాలు, రాజ్యపాలనపై గురువు చెప్పిన తొలి పాఠాన్ని కనీసం విననైనా వినలేదు.

విష్ణుశర్మ ఓటమిని అంగీకరించలేదు. రాజ కుమారులు ముగ్గురూ తనకు చావు కొనితెచ్చే టట్లు కనిపించారతడికి. భరతవర్షంలోనే అతి గొప్ప బోధకులలో ఒకరిగా అతడు పేరుగాంచాడు మరి. అవమానం మాట అటుంచితే రాజుకు తన ముఖం ఎలా చూపించాలి?

గత మూడునెలలుగా ఇలాగే జరుగుతోంది. ఈ రోజు కూడా అందుకు భిన్నంగా లేదు. అయితే గురువు అంత తేలిగ్గా వదిలిపెట్టదలుచుకోలేదు.



‘‘రాజ్య శాసనాలకు, ప్రభుత్వానికి, న్యాయ వ్యవ హారాలకు సంబంధించిన వాస్తవ జ్ఞానాన్ని రాజనే వాడు తప్పక తెలుసుకుని ఉండాలి.’’

పురు నిట్టూర్చాడు, మను చెవులు ఆడించాడు. విక్రమ్ విసుగ్గా ముఖం పెట్టాడు. ‘‘సింహాసనానికి వారసుడిగా, నా రాజ్యాన్ని ఎలా పాలించాలో మరొ కరిని సలహా అడగవలసిన పని నాకు లేదు.’’ అని తేల్చి చెప్పాడు. ‘‘నీకేమీ తెలియకపోతే అప్పుడు మహిలారూప్య రాజ్యం కుప్పగూలిపోతుంది.’’ మను వెక్కిరించాడు.

‘‘నాకు అమర గుప్తుడు ఉన్నాడు.’’ విక్రమ్ అందుకున్నాడు. ‘‘అతడి తండ్రి సంపన్న వ్యాపారి. అమర్‌ని నా ప్రధానామాత్యుడిగా నియమిస్తే అరేబియన్ గుర్రాల మందను బహుమతిగా ఇస్తా నని నాకు వాగ్దానం చేశాడు కూడా...’’

ఆ సమయంలో విష్ణుశర్మ అడ్డుకున్నాడు. ‘‘అయితే నువ్వు కూడా కపింజల, సిగ్రాహులు చేసిన తప్పే చేయబోతావన్నమాట.’’

‘‘వాళ్లు ఎవరూ?’’ అడిగారు పురు, మను.

‘‘వాళ్లు మీ మిత్రులా?’’ విక్రమ్ ఎత్తిపొడి



న్నాడు పురు. ''నువ్వు ఒక అజ్ఞానివి,'' అన్నాడు.

''మంచిమాట చెప్పావు.'' విష్ణుశర్మ మధ్యలో అందుకున్నాడు. ''కపింజల, సిగ్రహుడు కూడా ఇలాంటి వారే'' అన్నాడు. ''తరవాత ఏం జరిగింది?'' ప్రశ్నించాడు మను ఎంతో ఆసక్తిగా. ''తీర్పు కోసం వచ్చిన ఆ రెండింటిని పిల్లి చక్కగా ఆరగించింది.'' ప్రశాంతంగా చెప్పాడు విష్ణుశర్మ. ''మీ బద్ధ శత్రువు మిమ్మల్ని బంధించి ఊరికే వదలి పెడతాడని మీరనుకుంటున్నారా ఏమిటి?''

''హు..'' రాజకుమారులు నిశ్శబ్దంగా కూర్చుండిపోయారు. గురువు చెప్పిన మాటల్లోని చేదునిజం వారిని మూగవారిని చేసింది.

''అయితే జ్ఞానం గురించి బోధించే ప్రతి ఒక్కరూ నమ్మదగిన వారు కానట్లేనా మరి, మీ విషయం ఏమిటి? మీరు కూడా గురువే కదా,'' అడిగాడు విక్రమ్.

విష్ణుశర్మ మందహాసం చేశాడు. ''యువ రాజా, ఇప్పుడు మీరు మీ బుర్రను ఉపయోగించారు. ఉదాహరణకు చూడండి. తెలివైన కాకి స్థిరజీవి....''

చాడు. ''నిజంగా మిత్రులే..''విష్ణుశర్మ వారికేసి తీక్షణంగా చూశాడు.

''తాము నివసించే చోటు గురించి పిచ్చుక, కుందేలు గతంలో ఇలాగే వాదులాడుకుని పిల్లిని సంప్రదించాయి.'' అన్నాడు.

''పిచ్చుకలు, కుందేళ్లు, పిల్లులా?'' అంటూ ముగ్గురూ ముక్తకంఠంతో వంతపాడారు.

''జంతువులు గొప్ప జ్ఞానాన్ని కలిగి ఉంటాయి. దాన్ని మనం గ్రహించగలిగితే చాలు. అయితే ఈ పిల్లి గొప్ప జ్ఞానిలాగే కనిపించింది.'' అంటూ గురువు ఇలా పాడి వినిపించాడు.

''బుద్బుదప్రాయమైన ఈ శరీరం ఎల్లకాలం జీవించదు భౌతిక సంపద శాశ్వతం కాదు.

చావు.. అన్నివేళలా మీ తలుపు ముంగిట కాచుకుని ఉంటుంది. ఇహలోక బంధనాలనుంచి విముక్తిడివి కమ్ము. ధర్మాన్ని పరిత్యజించినవాడు సజీవుడై కనిపించవచ్చు కాని, వాస్తవానికి అతడు మృతుడే..''

''చాలా మంచిమాట,'' అంటూ గొణిగాడు విక్రమ్. ''నీకెలా తెలుసు,'' వెంటనే అందుకు

***

క్రీ.పూ. 412, చైత్రమాసం 20, మహిళారూప్య రాజమందిరం

''... మన సరిహద్దు గ్రామాలపై ప్రత్యక్ష దాడి ప్రమాదాన్ని మనం విస్మరించరాదు. మన పొరుగున ఉన్న పాలకులు చాలా శక్తిమంతులు. వారితో మనకు సఖ్యత కావాలి.'' రాజు అమరశక్తి ఆస్థానంలో సింహాసనంపై కూర్చుని ఉన్నాడు. అతడి ఫాలభాగంలో ఆందోళన ప్రస్ఫుటంగా కనిపిస్తోంది. సుమతి నేతృత్వంలో మంత్రులు, శత్రువును ఎదుర్కొనడానికి చేపట్టవలసిన చర్యలపై తమకు తోచిన సూచనలు రాజు ముందు పెడుతున్నారు.

విష్ణుశర్మ సభలో ప్రేక్షకుల మధ్య ప్రశాంతంగా కూర్చుని ఉన్నాడు. రాజకుమారులు ముగ్గురూ అతడి వెనుకే ఉన్నారు. ఉన్నట్లుండి రాజు తన కుమారులకేసి చూపు సారించాడు. ''ఏదో ఒక రోజు మీరు ఈ రాజ్యాన్ని ఏలవలసి ఉంటుంది. ఈ సమస్యపై మీరేమనుకుంటున్నారు?'' రాజకుమారులు ముగ్గురూ ఒకరివైపు ఒకరు చూసుకున్నారు. ఒక్కసారిగా తమ గురువుకేసి చూశారు. గురువు తలూపాడు.

విక్రమ్ లేచి నిలబడ్డాడు. ''వందనాలు మహారాజా, పాలకులు శాంతిని కొనసాగించాలి కనుక ఇతర అవకాశాలను ఉపయోగించుకోవాలి. యుద్ధం మన అహంకారాలను సంతృప్తి పర్చవచ్చు. కాని దానివల్ల ప్రజలు అనవసరంగా బాధలకు గురవుతారు. మన పొరుగు రాజులను వెనుదిరిగి పొమ్మని గౌరవంగా చెబితే చాలు.'

''సామరస్య రీతి విఫలమైతే అప్పుడు జిత్తులను ఉపయోగించవచ్చు.'' జోడించాడు పురు.

''అది కూడా విఫలమైనట్లయితే మన శక్తిని శత్రువుముందు ప్రదర్శించి వారి మనస్సులను మార్చవచ్చు.'' చెప్పాడు మను.

సభలో మౌనం రాజ్యమేలింది. తరవాత రాజు లేచాడు. మెల్లగా తన కుమారులు ఉన్న చోటుకు నడిచి వెళ్లి వారిని కౌగలించుకున్నాడు. తర్వాత అతడు విష్ణుశర్మ పాదాలకు నమస్కరించాడు. ''ఆచార్యా, మీరు మీ ప్రమాణాన్ని నిలబెట్టుకున్నారు.''

''మరి దాడివిషయం ఏమిటి ప్రభూ,'' అని అడిగాడు విష్ణుశర్మ.

''దాడి ప్రమాదం ఏదీ లేదు. నా కుమారుల చదువు ఎంతవరకు వచ్చిందీ తెలుసుకోవాడానికి ఆడిన నాటకం అంతే.'' అంటూ మందహాసం చేశాడు రాజు. ''నా పిల్లలను ప్రయోజకులను చేశారు. మీకేం కావాలో కోరుకోండి. కోరిందల్లా ఇస్తాను.''

తనకు ఏమీ అక్కరలేదని విష్ణుశర్మ రాజుకు చెప్పాడు. తర్వాత రాజు, గురువును అడిగాడు. ''ఇతరులు సంవత్సరాల కాలంలో కూడా చేయలేనిది మీరు ఇంత తక్కువకాలంలో సాధించారు. ఎలా జరిగింది?''

విద్యాసంపన్నుడయిన ఆ గురువు నవ్వుతూ చెప్పాడు. ''సుదీర్ఘ ఉపన్యాసాలు చేస్తూ పోతే వినడానికి ఎవరూ ఇష్టపడరు ప్రభూ, కాని పాఠాలను కథలోకి మార్చి చెబితే చదువు పట్ల ఏ మాత్రం ఆసక్తి లేని పిల్లవాడు కూడా విసుగు చెందడు. విసుగులేకుండా పాఠం ఎలా చెప్పాలనేది ఈ సందర్భంగా నేనూ నేర్చుకున్నాననుకోండి.''

రాజు అమరశక్తి ఫకాలున నవ్వాడు. ''మీ కథలు దినదిన ప్రవర్ధమానములై సకల ప్రపంచానికీ బోధించుగాక!''

– పవిత్రా శ్రీనివాసన్



# శిథిలాలయం - 4




(శిథిలాలయం పూజారినని చెప్పిన వికృతాకారుడి కోసం శిఖిముఖీ, విక్రమకేసరీ చెరొక మార్గాన వెళ్లారు. శిఖిముఖి మామిడితోపులో అడుగు పెట్టేసరికి, అతడి కాలికొక తాడు బిగుసుకుపోయి, చెట్టుకొమ్మకు వేలాడదీసింది. పూజారిని శిఖిముఖి ఈటెతో పొడవబోయాడు. పూజారి అనుచరులు అరుస్తూ, అతణ్ణి చంపేందుకు కత్తులెత్తారు. - తరవాత)

పూజారి అనుచరులు తన పైకి కత్తులెత్తడం చూస్తూనే శిఖిముఖి తనకు చావు తప్పదనుకున్నాడు.

తను చచ్చే ముందు ఆ దుర్మార్గుల్లో ఒక్కణ్ణయినా చంపి తీరాలన్న పట్టుదలా, ఉద్రేకం అతడిలో పరవళ్లు తీసింది.

ఆ వెంటనే అతను ''జై శబరమాతా!'' అంటూ అరణ్యం ప్రతిధ్వనించేలా అరిచి, తన కాలిని బిగించి పట్టి ఉన్న తాడును ఈటెతో గురిగా ఒక్కపోటు పొడిచాడు. ఆ దెబ్బకు తాడు సగం నరుక్కుపోయింది.

తతిమ్మా సగం అతడి బరువును మోయలేక పటేమంటూ తెగింది. శిఖిముఖి ఏ మాత్రం అజాగ్రత్తగా ఉన్నా, అతడి తల బలంగా నేలను తాకటం జరిగేది. కాని అతడు వానరంలా ఒక్క ఊపున కాళ్లు రెంటినీ ఫల్టీ కొట్టినట్టు గిర్రున భూమి మీదికి తెచ్చి, దాని తాకిడిని తట్టుకునేందుకు ఈటెను ముందుగా నేలమీద గుచ్చాడు.

పూజారి అనుచరులు అతడి లాఘవం చూసి ఆశ్చర్యపోయారు.

వాళ్లలో ఒకడు శిఖిముఖిని మెచ్చుకుంటూ, ''శబర వెధవ బాగా సాముగరిడీలు నేర్చిన వాళ్లా ఉన్నాడు. ఇలాంటివాడు మన ముఠాలో కలిసి వుంటే, మనం సాధించలేనిదేముంటుంది?'' అన్నాడు.

దాసరి సుబ్రహ్మణ్యం

''వీడు మనిషి కాదు, మర్కటం. నేలంటకుండా చెట్లకొమ్మల మీద గెంతుతూ వింధ్య పర్వతాలనే చేరగలడు. చూస్తారేం, పొడవండి!'' అన్నాడు మరొక అనుచరుడు.

ఈ విధంగా ఒకటి రెండు క్షణాలు పూజారి అనుచరులు నిర్విణ్ణులైపోయి, తనమీద కత్తులు ప్రయోగించడానికి బదులు వాచాలత చూపటం శిఖిముఖికి మంచి అవకాశం కలిగించింది. అతడు ఒడుపుగా ఒక విరోధి మోకాలి మీద బలంగా తన్ని, వాడు అరుస్తూ వెనక్కు పడబోయేంతలో మెరుపులా వాడి వీపు కింది నుంచి చర్రున జారి తన చుట్టూ ఉన్న శత్రువలయాన్ని ఛేదించి బయట పడగలిగాడు.

పూజారి అనుచరులు శిఖిముఖి పారిపోయే యత్నం చేస్తున్నాడని తెలిసి కూడా, కత్తులు ఉపయోగించలేకపోయారు. కత్తి పొరపాటున తమ వాళ్లకే తగులుతుందేమో అన్న భయం వాళ్లక్కలిగింది.

శిఖిముఖి శత్రువునే తన కవచంగా వాడుకోగలిగాడు. కాని ఒకసారి అతడు వాళ్లనుంచి కొంచెం దూరం పరిగెత్తగానే పూజారి అనుచరులంతా ఒక్కసారిగా, ''చంపండి, పారిపోనీకండి,'' అని అరుస్తూ అతడి వెంటబడి చుట్టుముట్టేందుకు ప్రయత్నం చేశారు.

ఆ సమయంలో దూరం నుంచి ఈల వినబడింది. అది శిథిలాలయం పూజారి తన బంట్లకిచ్చే హెచ్చరిక. ఆ హెచ్చరిక వింటూనే అతడి అనుచరుల్లో ఒకడు, ''పూజారి దొర పిలుస్తున్నాడు, వినబడలేదా, పరిగెత్తండి,'' అన్నాడు.

''ఈ పారిపోతున్న శబరపిశాచంగాడి మాటేమిటి? వీణ్ణి పట్టుకు పోవద్దా పూజారి దొర దగ్గిరికి'' అని ప్రశ్నించాడొకడు.



ఆ ప్రశ్నకు మొదట మాట్లాడిన వాడు జవాబు చెప్పబోయేంతలో, ఎర్రగండు పెద్దగా మొరగటం వినబడింది. ఆ వెంటనే శబరుల కేకలూ, విక్రమకేసరి, ''శిఖిముఖీ! శిఖిముఖీ!'' అని పిలుస్తూ అటుగా పరుగెత్తుకు రావడం దొంగల కంటబడింది.

పూజారి ఈసారి మరింత దగ్గిరగా ఈల వేశాడు. వాడి అనుచరులంతా ఒకణ్ణొకడు ఎలాంటి హెచ్చరికా చేయకుండానే గాయపడిన దొంగలను భుజాన వేసుకుని గిర్రున వెనుదిరిగి, అరణ్యంకేసి పరిగెత్తసాగారు.

శిఖిముఖి ఎర్రగండును గట్టిగా కేకవేశాడు. ఆ కేక వింటూనే కుక్క అతడున్న చోటుకు పరిగెత్తుకొచ్చింది. కొంచెం వెనగ్గా విక్రమకేసరీ, నలుగురైదుగురు శబరులూ అక్కడికొచ్చి చేరారు.

''నువ్వేదో ప్రమాదంలో చిక్కుకున్నావని నేను భయపడ్డాను, శిఖిముఖీ!'' అన్నాడు విక్రమకేసరి.



ఎక్కడ దాగి ఉన్నారో చూసి, పల్లెకు వార్త తెస్తాం.'' అని చెప్పాడు.

శబరులు వెళ్ళిపోయారు. ఆ తరవాత శిఖిముఖీ, విక్రమ కేసరీ అరణ్యం కేసి బయలుదేరారు. ముందు ఎర్రగండు నేలను పశిగడుతూ నడవసాగింది. అది దొంగలు పోయిన మార్గాన్ని సరిగానే గుర్తించిందన్న నమ్మకం శిఖిముఖికి కలిగింది. క్రమంగా ఎర్రగండు వాళ్లను అరణ్యంలోని ఒకానొక కొండ ప్రాంతానికి తీసుకుపోయి, అక్కడ ఒక మహా వృక్షం కింద నిలబడి కొంచెం సేపు భూమిని మూచూసి, చెట్టు చుట్టూ గిర్రుగిర్రున తిరుగుతూ, తల ఎత్తి పైకి చూడసాగింది.

విక్రమకేసరికి కుక్క ప్రవర్తన వింతగా కనబడింది. అతడేమో మాట్లాడబోయేంతలో శిఖిముఖి అతడిని వారించి, తల ఎత్తి చెట్టు కొమ్మల్లోకి పరీక్షగా చూశాడు. గుబురు కొమ్మల్లో అతడికో మానవాకారం కనబడింది. బాగా పరీక్షగా చూసిన మీదట శిఖిముఖికి వాడు పూజారి అనుచరుడని తెలిసిపోయింది. వాడు, చెట్టు కొమ్మ నొకదాన్ని రెండు చేతులతో గట్టిగా కావిలించుకుని, కొమ్మ మీద బోర్లాపడుకుని నిద్రపోతున్నాడు. ఒర నుంచి కత్తి కిందికి వేళ్లాడుతున్నది.

శిఖిముఖి వాణ్ణి విక్రమకేసరికి చూపుతూ, చిన్న గొంతుతో, ''కేసరీ, వాడు శిథిలాలయ పూజారి కాపలావాడన్నమాట. చెట్టు మీద దాగి, ఈ ప్రాంతాలకు వచ్చేవాళ్లను కనిపెట్టి ఉండి, కబురందించమని ఆ వికృతాకారుడు వీణ్ణి ఇక్కడ కాపలా పెట్టి ఉంటాడు. కాని, ఈ వెధవ రాత్రంతా అరణ్యంలో చెడతిరిగి సూర్యోదయం వేళకు హాయిగా చెట్లకొమ్మల్లో నిద్రపోతున్నాడు,'' అన్నాడు

''చాలా పెద్ద ప్రమాదంలోనే చిక్కుకున్నాను. అదృష్టం కొద్దీ బయటపడ్డాను. ఆ దుర్మార్గులీ ప్రాంతాన మాటుపెట్టి నన్ను తలకిందులుగా వేలాడదీసి చంపాలని చూశారు... అదంతా తరవాత మాట్లాడుకోవచ్చు. ముందు ఆ పూజారి బంట్లు దాగి ఉండే స్థలం ఏదో మనం తెలుసుకోవాలి. ఒకళ్లిద్దరం అయినా, వాళ్లను వెన్నంటి పోగలిగితే, సూర్యోదయం కాగానే ఆ ముఠానంతా అడవి జంతువులను వేటాడినట్లు వేటాడవచ్చు,'' అన్నాడు శిఖిముఖి.

''వాళ్లు అరణ్యంలో ఎక్కడ దాగి ఉండేదీ కనుక్కోవడానికి మన ఇద్దరం చాలు. ఎర్రగండు పశికట్టి మనకు దారి చూపగలదు. తెల్లవారగానే, పల్లెవాసులంతా మనకు సహాయం వస్తారు,'' అంటూ విక్రమ కేసరి తన వెంట ఉన్న శబరుల కేసి తిరిగి, ''ఇక మీరు పల్లెకు పొండి. మరొక సారి పూజారి అనుచరులు పల్లెకు నిప్పు పెట్టకుండా చూసుకోండి. మా ఇద్దర్లో ఎవరో ఒకరం ఆ క్రూరులు అరణ్యంలో



పించింది. వాడు భయకంపితుడై అరవబో యేంతలో, శిఖిముఖి చేతిపట్టును మెడమీంచి గొంతు మీదికి మార్చి, ''నోరెత్తావో, ఈటె గుండెల్లో దించుతాను. కొద్ది రోజులపాటైన బతకదలిస్తే, కిక్కురు మనకుండా నాతోపాటు చెట్టు దిగు,'' అని చెప్పి, వాడి ఒర నుంచి కత్తి లాక్కుని చెట్టు దిగాడు. పూజారి అనుచరుడు గడగడ వణికిపోతూ అతడి వెనకగా చెట్టు దిగి వచ్చాడు.

శిఖిముఖి, పూజారి అనుచరుణ్ణి చెట్టు బోదెకు అనుకు కూర్చోమని ఆజ్ఞాపించి, ''నువ్వా ప్రేతాకారం గాడి బంటువేగదా? నిజం చెప్పకపోయావో నిన్ను ప్రాణాలతోనే ఎర్రగం డుకు ఆహారంగా వేస్తాను. వాడీ కొండ ప్రాంతాల ఏ గుహలో ఉంటున్నాడు?'' అని ప్రశ్నించాడు.

పూజారి అనుచరుడు ప్రాణభయంతో కంపించిపోతూ, ''అయ్యా, నన్ను చంపకండి, నిజం చెబుతాను. పూజారి దొర ఈ కొండ ప్రాంతాల పూటకొక చోటు మారుతుంటాడు. నిన్న సాయంకాలం ఆ దొర ఉన్న చోటు - ఒంగున్న రాక్షసిలా కనబడే ఆ గండశిల వెనక ఉన్న చీకటి గుహ. ఇప్పుడింకా, అక్కడ ఉన్నాడో లేదో నాకు తెలీదు.'' అన్నాడు.

''నువ్వు నిజమే చెబుతున్నావా?'' అని గద్దించి అడిగాడు శిఖిముఖి.

''పూజారి పెద్ద అబద్ధాల కోరు. వాడి బంటు మరొక విధంగా ఎందుకుంటాడు? ఎర్రగండును ఉసిగొలుపు శిఖిముఖీ,'' అన్నాడు విక్రమకేసరి.

శిఖిముఖి ఊ అనగానే ఎర్రగండు పూజారి అనుచరుడి మీదికి ఎగిరి దూకి వాడి గొంతు పట్టుకోబోయినదల్లా ఆగి, తల తిప్పి, యజ మాని కేసి చూసింది. ''ఆహా, ఇది కుక్క కాదు.

''వీణ్ణి మనం ప్రాణాలతో పట్టుకుని పూజా రిని గురించిన రహస్యాలు లాగాలి.'' అన్నాడు విక్రమ కేసరి.

''ప్రాణాలతో పట్టుకోవడమే కాదు, నిద్ర మేల్కొని అరవకుండా చూడాలి. వీడు అరి చాడో, పూజారికి మనం ఈ ప్రాంతాలకు వచ్చి నట్టు తెలిసిపోతుంది. అదుగో సూర్యోదయం కూడా అవుతున్నది. నువ్వు చెట్టుకిందనే ఉండు. నేను నిశ్శబ్దంగా చెట్టెక్కి వాణ్ణి కిందికి లాక్కొ స్తాను.'' అని చెప్పి శిఖిముఖి దాపులనున్న చెట్లమీది కొన్ని అడివి తీగలను తెంచి, అరచేతి వెడల్పూ, ఒక గజం పొడవూ ఉండేటట్టుగా వాటిని అల్లి, మెల్లిగా చెట్టు మీదికి పాకిపోయి, పూజారి అనుచరుడి మెడను గట్టిగా ఒక చేత్తో పట్టుకుంటూనే, రెండో చేత్తో ఈటెను అతడి కళ్లముందు ఆడించాడు.

పూజారి అనుచరుడు ఉలిక్కిపడి కళ్లు తెరి చాడు. ఎదురుగా వాడికి ఉదయసూర్య కిర ణాల్లో తళతళా మెరుస్తున్న ఈటె అలుగు కని

ఇంగితం ఎరిగిన మనిషి,'' అన్నాడు విక్రమ కేసరి. పూజారి అనుచరుడు ప్రాణభీతితో అరవ బోయేసరికి శిఖిముఖి అతడి మీదికి ఈటె గురి చేసి, ''అరవకు, ఇప్పటికైనా అబద్ధాలాడక, నిజం చెప్పు, ఎర్రగండు నిన్నేమీ చేయదు.'' అన్నాడు.

''నేను నిజమే చెప్పాను. రక్షించు దొరా!'' అంటూ పూజారి అనుచరుడు కళ్లనీళ్లు పెట్టాడు.

దొంగవాడి కళ్ల నీళ్లు చూడగానే, విక్రమ కేసరికి అతడి మీద జాలి కలిగింది. అతడు శిఖిముఖి భుజం పట్టుకుని ''శిఖీ! పాపం వాణ్ణి చంపకు. నిజమే చెప్పాడు. తెలియటం లేదా? మనం వీడు చెప్పే ప్రాంతానికెళ్లి చూద్దాం. పూజారి పెద్ద ముచ్చు వెధవ. వాడు తనను నమ్మి సేవ చేసేవాళ్లతో అయినా మనసిచ్చి మాట్లాడతాడని నేననుకోను,'' అన్నాడు.

శిఖిముఖి ఎర్రగండును ఇవతలికి పిలిచి, దొంగతో, ''ఒరే నిన్ను కొంతసేపయినా కాళ్లూ చేతులూ కట్టి, నోరు బిగించి , ఆ పొదల్లో దాచి పోక తప్పదు. మీ యజమాని ఎక్కడున్నాడో చూసి తిరిగొచ్చేటప్పుడు నీ కట్లు విప్పుతాను,'' అంటూ నోటికి అడ్డంగా అడివి తీగలతో అల్లిన వలనొకదాన్ని బిగించి, మూటలా ఎత్తుకుపోయి గుబురుగా ఉన్న పొదల్లో పడవేశాడు.

తరవాత శిఖిముఖి, విక్రమకేసరీ, ఎర్ర గండూ దొంగ చెప్పిన కొండ ప్రాంతానికేసి బయలుదేరారు. వాళ్లకా సమీప ప్రాంతాల్లో మనుషులు సంచరించిన గుర్తులు కనిపించినై. వాటిని చూస్తూ వాళ్లు మరికొంత ముందుకు పోయేసరికి, నలుగురైదుగురు మనుషులు పక్కపక్కన నడవడానికి వీలుగా ఉన్న ఒక కొండ దారి మీద అంత ఎత్తున ఒక కొయ్యబొమ్మ కని పించింది. దాని చేతుల్లో రక్తంలో తడిసి ఉన్న త్రిశూలం ఉన్నది.

విక్రమకేసరి ఆ భయంకర విగ్రహాన్ని చూసి ఆశ్చర్య పడుతూ ముందుకు నడవబోయేం తలో, శిఖిముఖి అతడి భుజం పట్టుకుని వెనక్కు లాగి, ''కేసరీ, ఆగు, మనం ఆ దారివెంట పోవాలంటే, ఆ కొయ్య బొమ్మ కాళ్లమీదుగా నడవాలి. దాని చేతిలో రక్తం ఓడుతున్న త్రిశూ లాన్ని చూశావా?'' అని ప్రశ్నించాడు.

వాళ్లిద్దరూ ఇలా మాట్లాడుతున్నంతలో ఎర్ర గండు కొయ్యబొమ్మను సమీపించి, దాని కాళ్ల కిందుగా ముందుకు పోబోయింది. అంతలో బొమ్మ జవజవ మంటూ వణికింది. దాని చేతిలో ఉన్న త్రిశూలం మెరుపులా నేలమీదికి ''జుమ్'' అంటూ దిగసాగింది.

– (ఇంకా ఉంది)







# విచిత్రజీవి రూపాంతరం

(జరిగిన కథ: శంతను, శివ తాతయ్య డాక్టర్ పురంజన్ దాదాపు ఘర్షించుకునే స్థాయికి వచ్చేశారు. శంతను ఒకప్పుడు తాతయ్య విద్యార్థిగా ఉన్నట్టు తెలుస్తోంది. ఆ రాత్రి, శివ.. శంతనుకు చెందినదిగా కనిపించే ఒక విచిత్ర జీవిని చూశాడు.)

నేను ఉదయం మేల్కొన్నప్పుడు, జరిగిందంతా కలగన్నానేమో అనిపించింది కానీ తేల్చుకోలేకపోయాను. రాత్రి నేను చూసిన డ్రాగన్ లాంటి విచిత్రజీవికి సంబంధించిన గుర్తులేవీ ఇప్పుడు కనిపించడం లేదు. తర్వాత కూడా దాని ఆనవాళ్లను అనునిర్వలో నేను చూడలేకపోయాను. మానవులను దాదాపుగా గుహకే పరిమితం చేశారు. ఎప్పుడో ఒకసారి మయూరి చూడ్డానికి వచ్చేది. ఆమె నీలి వదనం ప్రశాంత సముద్రాన్ని తలపింపజేసేది. చాలామంది గుహను దాటి బయటకు రావడానికి సాహసించే వారు కాదు. నైలు మొసలి ప్రమాదకరమైన చూపులను మర్చిపోవడం ఎవరికైనా కష్టమే. వారిప్పటికే దాని బారినపడి తృటిలో తప్పించుకున్నారు కూడా. రోజుల తరబడి వారు తమలోతాము గుసగుసలాడుకుంటూ, గుహ సమీపంలోని జలాల్లో ఈదుతూ, అరుదుగా వచ్చే సందర్శకులు లెమన్, ఒమెన్‌లతో ముచ్చటిస్తూ గడిపారు. వారు ఒక్కోసారి చీనా ఏనుగును కూడా తీసుకువచ్చేవారు.



జలదేవతలు తరచుగా గుహల్లోకి వచ్చేవారు. కాని వారు మాతో స్నేహం చేసేవారు కాదు. వారు మాకు కాపలా కాస్తున్నారా అని ఆశ్చర్యపోయేవారం. ఇతర ప్రాణులనుంచి మమ్మల్ని కాపాడటం లేదా మరీ దూరం పోకుండా మమ్మల్ని అడ్డుకోవడం.. వారు ఏం చేస్తున్నారో అర్థం కాలేదు. వారు ప్రశాంతంగా ఉండేవారు. కాని నేలమీదికి పోయి మాలో ఎవరైనా ఈదడానికి లేదా నడవడానికి ప్రయత్నిస్తే వారి మెరిసే కళ్లలో వేగంగా రంగులు మారేవి. వారు నిశ్శబ్దంగా, తీక్షణంగా చూసేవారు లేదా అలా ప్రయత్నించిన వ్యక్తి భుజంమీద తమ చల్లటి చేయి పెట్టి బలంగా నొక్కేవారు. ఆ భంగిమ

ఓ హెచ్చరిక లాగా అనిపించేది. జలదేవతలను ధిక్కరించి ముందుకు పోతే ఏం జరుగుతుందో చూడటానికి ఎవరూ సాహసించేవారు కాదు.

తొలి రోజు ఘర్షణ జరిగాక తాతయ్య, శంతను ఒకరికొకరు కలవకుండా ఉండటానికి ప్రయత్నిస్తున్నట్లు కనిపించింది.

నిమ్మీ మరియు హర్షా అనునిర్వను బాగా ఇష్టపడ్డారు. రోజు వారు అనునిర్వలో తిరిగేవారు. అక్కడ తప్పక హాజరు కావడానికి స్కూలు వంటిది లేదు. ట్యూషన్ తరగతులు లేవు. ఉదయం పూట తాగడానికి పాలు లేవు. పిల్లలకు ఇంతకు మించి ఏం కావాలి? ఇప్పుడు నిమ్మీ తన కోసం జనం తెచ్చి ఇచ్చిన పలు పగడాల హారాలను ధరిస్తోంది. రోజూ నీళ్లలో ఈదుతున్నప్పుడు మెడలోంచి జాలువారే పగడాల పూసలను చూసి ఆమె పరవశించిపోయేది. జలరాణి తన సామ్రాజ్యంలో ఈదుతున్న అనుభూతిని పొందేది.

ఒకరోజు నేను ప్రశాంతంగా గుహముందు భాగంలో కూర్చుని ఉన్నాను. హర్షా నావద్దకు వచ్చి చెప్పాడు, ''శివా, నేను నిన్ను ఒకటడగాలని అనుకుంటున్నాను. నిమ్మీకి మాత్రం ఈ విషయం చెప్పవద్దు.''

నేను తలూపాను. అతడు నా ఎదురుగా కూర్చుని కాస్సేపు మౌనంగా ఉన్నాడు. నీటిపాము నీటిలో మునుగుతూ, తేలుతూ ఉంటే చూస్తూ అతడన్నాడు. ''నా తండ్రి.. రాత్రి ఇక్కడ గుహదాటి పైనున్న నేలమీదికి వెళ్లాడు.''

నేను ఆశ్చర్యపోయాను. శంతనుకు అట్టే మంచి పేరులేదు.

విచిత్రజీవి నా భ్రమ అని దాదాపుగా నిశ్చయానికి వచ్చేశాను. కాని హర్షా చెబుతున్నది



వింటూంటే నా పాత సందేహాలు మళ్ళీ చుట్టుముట్టాయి. అయితే నేను దీనిపై ఏమీ మాట్లాడదలచుకోలేదు. హర్ష ఇప్పటికీ చిన్నవాడు. శంతను ఏదో చేస్తున్నాడని చెప్పేందుకు నావద్ద ఆధారాలు లేవు.

''నీవెందుకు ఆందోళనపడుతున్నావు?'' నేనడిగాను.

''అవును... ఇక్కడ అన్ని రకాల ప్రాణులూ ఉన్నారు. అతడు చనిపోతాడేమోనని నాకు భయంగా ఉంది.'' చెప్పాడు హర్షా.

''అతడు ఎప్పటినుంచి అలా వెళుతున్నాడు?''

''నాకు తెలియదు, ఒక రాత్రి, నేను నిమ్మీ పక్కన పడుకుని ఉన్నా, అంతలో నా కాలి వద్ద పాకుతున్న దాన్ని నేను గమనించాను. నేను మేలుకుని చూస్తే మెరుస్తున్న కళ్లు కనిపించాయి. నేను నిజంగానే భయపడ్డాను. అయితే నిమ్మీని లేపవద్దని భావించాను.



లేపితే ఆ ప్రాణి మా ఇద్దరినీ చంపుతుందని అనుకున్నాను.''

''అంటే అతడే విచిత్రజీవి అన్నమాట,'' అని తలచాను.

హర్షా ఇంకా ఇలా అన్నాడు. ''అప్పుడు నేను ఆ విచిత్ర జీవిని నాన్న తన చేతుల్లోకి తీసుకోవడం చూశాను. అది పసిపాప అరుస్తున్న ధ్వనిని తలపించింది. మా నాన్న దాన్ని ఓదారుస్తున్నట్లు కనిపించింది. తర్వాత అతడు గుహబయటకు వెళ్లడానికి పూనుకున్నాడు. నేను అతడిని అనుసరించాను.''

''తర్వాత?'' నేను వెంటనే అడిగాను.

''అతడు నీటిని చేరుకోగానే, ఆ ప్రాణిని అతడు నేలమీదికి దింపి, మంట వెలిగించాడు...''

హర్షా ఊపిరి పీల్చుకున్నాడు. అతడు ఆందోళన చెందుతున్నట్లనిపించింది. అతడు తన చిన్ని గోధుమ రంగు వదనాన్ని నా పక్క నుంచి తిప్పుకున్నాడు.

''అప్పుడేం జరిగింది హర్షా?''

''అతడు విసిరేశాడు. ఆ విచిత్రప్రాణిని మంటలోకి విసిరేశాడు. కలవరంగా చెప్పాడు హర్షా. అది బయటకు రావడానికి ప్రయత్నించింది. కాని దాన్ని తిరిగి మంటలోకి విసిరేశాడు. అది కొట్టుకులాడింది. తర్వాత దాని పొలుసులు ఊడిరావడం మొదలెట్టాయి. దాని గులాబిరంగు మాంసాన్ని చూశాను. నాకు చాలా బాధేసింది శివా!''

హర్షా ఏడ్చేశాడు నేను తన చేయి పట్టుకుని బాగా ఏడవనిచ్చాను.

''మానాన్న దానికి సహాయం చేయలేదు. దాన్ని తిరిగి మంటల్లోకి నెట్టాడు. నిజంగా భయానకమైన ఘటన.!''

నేనేమీ చెప్పలేదు. కాని ప్రశ్నలతో నా తల వేడెక్కిపోయింది. దీనర్థం ఏమిటి? విచిత్ర జీవిని శంతను ఎందుకు మంటల్లో విసిరేశాడు? పైకి పోవడంలో అతని ఉద్దేశ్యం ఏమిటి? జలదేవతలు అతడిని ఎందుకు ఆపలేదు?

హర్షా ఇప్పటికి ఏడుపు ఆపాడు. చొక్కా అంచుతో ముఖం తుడుచుకుని కొనసాగించాడు. అతడి స్వరం ఇప్పుడు కాస్త దృఢంగా ఉంది.

''అప్పుడది పెరగసాగింది.''

''ఎవరు?''

''ఆ విచిత్ర ప్రాణే. అది వాస్తవానికి పెరగలేదు. మారుతోంది. అది చాలా పెద్దదిగా మారింది. దాని ముఖం కూడా మారింది. అది డాల్ఫిన్ లాగా పెరిగిపోయింది.''

''డాల్ఫిన్ లాగానా?'' ఆశ్చర్యపోయాను.

''అవును, ఆ సమయంలో మంట ఆగి

పోయింది. తర్వాత డాల్ఫిన్ మీద నాన్న స్వారీ చేశాడు. ఇదంతా ఆశ్చర్యంగా అనిపించింది.''

నేను క్షణకాలం ఆశ్చర్యపోయాను. హర్షా ఏమైనా కథలు అల్లుతున్నాడా అనిపించింది. కాని అతడి ముఖంలోని ఆందోళనను చూసి త్వరలోనే మేలుకున్నాను. అయినా నేను రైలులో లెమన్, ఒమెన్‌లను చూశానని చెప్పి ఉంటే ఎంతమంది నా మాటలను నమ్మే వారు?

''నన్నేం చేయమంటావు హర్షా?'' అడిగాను నేను.

''నాన్నను అనుసరిస్తూ పోయి అతడేం చేస్తు న్నాడో చేయాలనిపిస్తోంది'' అన్నాడు హర్షా.

''నీవు ప్రయత్నించావా?''

''ఒకసారి మాత్రమే, ఆ ప్రాణితో అతడు బయటకు పోతున్న సమయంలో మాత్రమే తొలిసారిగా చూశాను. కాని ఒక జలదేవత నన్ను ఆపింది.''

''అతడు నీతో ఏం చెప్పాడు?''అడిగాను కుతూహ లంతో

''నేను ముసలి వాడిని కావడానికి ఇంకా చాలా చిన్నవాడినని చెప్పాడు.''

జలదేవతలు అప్పు డప్పుడూ అలాంటి తెలి విమాలిన ప్రకటనలు చేస్తుంటారు.

ఎల్లవేళలా నీళ్లలో ఉంటున్నందున వాటి తలలో కాస్త కొత్తపదార్థం ఏదైనా చేరి ఉంటుం దేమో! అని నేను భావిం చాను.

''అతడు తిరిగి వచ్చేదాకా వేచి ఉన్నావా?'' అతడిని అడిగాను.

''లేదు. జలదేవత నాకు అడ్డంగా నిలబడి నేను వెనక్కు వెళ్లేంత వరకు తీక్షణంగా చూస్తూ ఉండింది.'' చెప్పాడతడు.

''నాన్నను అనుసరించకుండా జలదేవత నిన్ను అడ్డుకున్నప్పుడు నన్ను మాత్రం అది ఎలా అనుమతిస్తుంది?''

''నీకు స్నేహితులు ఉన్నారు. నీవు మా వంటి వాడివి కాదు.'' నా చేయి పట్టుకుని చెప్పాడు హర్షా. నేను కాస్సేపు ఆలోచించాను. నేను ఆత్రుతతోనే ఉన్నాను. శంతను ఏం చేస్తు న్నాడో కనుగొనాలని అనుకున్నాను. నాకు తెలి సినంతమేరకు, అతడు ఏదైనా కీడు తలపెడు తున్నాడా!

''సరే, మనం ఓ పథకం అల్లుదాం. నేను జలదేవతను ఏమార్చుతాను. ఈలోగా నువ్వు దాని కళ్లు గప్పి తప్పుకో మరి.'' చెప్పాను.

అతడు ఆత్రుతగా తల ఊపాడు. ''కాని నేను నిన్ను వంటరిగా వదలను. నేను కూడా



నిన్ను అనుసరించి వస్తాను.'' చెప్పాను. హర్షా తన వయస్సు గురించి కాస్త ధైర్యంగానే ఉన్నాడు కాని అతడింకా చిన్న పిల్లవాడే. మానవులు విలువ కోల్పోయిన నేలమీద అతడి సాహస యత్నం తప్పక అతడి ప్రాణానికి ముప్పు తెచ్చిపెడుతుంది.

''మనం చేయవలసింది ఇదీ...'' అంటూ నేను మొదలెట్టాను. అప్పుడే ఒక చేయి నా వీపు మీద ఆనినట్లయింది. వెనక్కు తిరిగాను. అతడు శంతను. మా సంభాషణ మొత్తంగా విన్నాడా? ఏమాత్రం శబ్దం లేకుండా అతడు మా వెనుక పొంచి ఉన్నాడన్నమాట. పని మొదలు పెట్టడానికి ముందే తొలి ఆటంకం ఎదురైంది. హర్షా ముఖం పాలిపోయింది. అతడు తన కళ్లను అపరాధభావనతో తిప్పుకున్నాడు. శంతను తీక్షణమైన చూపునుంచి నేను ప్రశాంతంగా ఉండేందుకు ప్రయత్నించాను.

''పిల్లలిద్దరూ సాహస కృత్యం చేయాలని చూస్తున్నారా?'' అడిగాడు శంతను యథాలాపంగా.

''లేదు లేదు, నేను శివను ఊరకే పోదామా అని అడిగానంతే.'' హర్షా గొణిగాడు.

''నిజంగానా? నేను నీ వయస్సులో ఉన్నప్పుడు, ఈ స్థలంలో సాహసం చేయాలని చాలా ఇష్ట పడ్డాను.'' శంతను గట్టిగా చెప్పాడు. అతడి కంఠం కఠోరంగా ఉండి భీతి గొలుపుతోంది. ''ఇది నిజంగా అద్భుతం. ప్రతి ఒక్కరూ ఇక్కడ రూపాంతరీకరణ చెందుతారు! చెంది తీరుతారు కూడా''

అతడు చివరి పదాన్ని మరీ నొక్కి చెప్పినట్లనిపించింది. అయితే హర్షా ఆ విషయం గమనించినట్లు లేదు.

''భద్రం శివా, అన్ని అద్భుతగాథల్లోనూ రాజులు కప్పలుగా మారతారు. కానీ ఇది మరొక విధంగా కూడా జరుగుతుంది.'' అతడి స్వరంలోని ఆగ్రహం స్పష్టంగా వినిపించింది. ''కప్పలు కాళ్లకింద పడి సులభంగా నలిగిపోతాయి తెలుసా''

నా మనస్సులో భయాందోళన అలుముకుంది. మా సంభాషణను అతడు విన్నాడనడంలో సందేహమే లేదు. తీక్షణంగా ఉన్న అతడి కళ్లలోకి తేరిపారజూశాను. నేను సాహస కృత్యాన్ని కోరుకున్నానని నాకు తెలుసు. కాని నా సమయం బాగా లేనట్లుంది.

(ఇంకా ఉంది.)

–సౌమ్యా రాజేంద్రన్





# నవ్వుల పువ్వులు



కొడుకు: తాత తలమీద వెంట్రుకలు ఎందుకు లేవు?
నాన్న: అది మేధస్సుకు చిహ్నం మరి.
కొడుకు: నీ జుట్టు ఎందుకంత పొడుగ్గా ఉందో నాకిప్పుడే తెలిసింది నాన్నా!



సేల్స్‌మన్‌తో మదన్: నాకు 15 అంగుళాల పొడవున్న తెరలు కావాలి.
సేల్స్‌మన్: అది చాలా తక్కువ పొడవు బాబూ!!
మదన్: అవి నా కంప్యూటర్ మానిటర్ కోసం లెండి. దాంట్లో విండోస్ ఉంది!



సునంద: పాఠశాల దంతవైద్యుడికి బాధ తెలియదన్నావు. కాని అలా కనిపించడం లేదు.
టీచర్: నువ్వు అతడిని గాయపర్చావా?
సునంద: లేదు లేదు, కాని అతడి చేతివేలును నేను కొరికితే గావుకేకలు పెట్టాడుమరి!



ఇంగ్లీష్ టీచర్: శ్యామ్, మీనాన్న పేరు ఇంగ్లీషులో చెప్పు.
శ్యామ్: మై ఫాదర్‌నేమ్ ఈజ్ బట్టర్‌రెడ్
టీచర్: వాట్?
శ్యామ్: అవును మేడమ్, అతడి పేరు 'ఎర్రవెన్న' మరి!



# ఎవరి గొప్ప వారిది



అనగా అనగా...

ఓ ఊరు! ఊరి ప్రక్కన చిన్న ఏరు. ఏటి గట్టున చెట్టు. చెట్టు క్రింద పుట్ట. చెట్టు మీద చిన్నిపిట్ట, నీటిలో ఓ బుల్లి చేప. పుట్టలో ఓ పెద్ద పాము ఉండేవి.

పాము ఎప్పుడు చూసినా రుసరుసలాడుతూ కస్సుబుస్సుమంటుండేది. పిట్ట కిలకిల్లాడుతూ, చేప కలకల్లాడుతూ ఉండేవి. వానొచ్చినా ఎండొచ్చినా, మంచు కురిసినా మబ్బులొచ్చినా పిట్ట కువకువలాడేది. చేప రెపరెపలాడేది.

గాలి తెమ్మెర వీస్తే... చెట్టు మీది ఆకులూ, ఏటిలోని అలలూ గలగల లాడేవి. పాము పైకి చూస్తే... పిట్ట రివ్వున గాల్లోకి ఎగిరి గిరికీలు కొట్టేది. ఆ కొమ్మ మీంచి ఈ కొమ్మ మీదికీ గెంతేది. ఆ గుబురుకీ ఈ గుబురుకీ కబురులు చెబుతున్నట్లుగా గుసగుసలాడేది. పక్కకి చూస్తే... చేప పిల్ల సర్రున నీళ్ళల్లోంచి గాల్లోకి ఎగిరి మళ్ళీ మునకలు వేసేది. నీటిలోకి పైకీ గింగరాలు తిరిగేది. ఈ మూల నుండి ఆ మూలకి మెరుపులా ఈదేది.

అదంతా చూసి పాముకి అసూయగా ఉండేది.

ఓ రోజు ఎప్పట్లాగే పిట్ట ఆనందంగా పాడుతోంది. చేప సంతోషంగా ఈదుతోంది. పాము కదంతా చూసి ముందు కోపం ఆపైన ఏడుపూ వచ్చాయి. అవెందుకంత ఆనందంగా ఉన్నాయి? తానెందుకు సంతోషంగా లేదు? అన్న సంగతి దానికి అంతుబట్టటం లేదు. ఇంతలో అక్కడికి ఇద్దరు కుర్రాళ్ళొచ్చారు. ఒకడి చేతిలో ఉండేలుంది. మరొకడి చేతిలో గాలం ఉంది. అంతే! పిట్ట గాల్లోకి, చేప నీళ్ళల్లోకి తుర్రుమన్నాయి. పాము పుట్టలోంచి తలబయటికి పెట్టి బుస్సుమంది. ఆ కుర్రాళ్ళిద్దరూ భయంతో అక్కడి నుండి పరుగుతీసారు.

ఆదిలక్ష్మి

చేపకీ పిట్టకీ తనని చూస్తే భయం. మనుష్యుల్నిచూసీ భయం. అలాంటిది మనుష్యులకి తనని చూసి భయం! గొప్పగా అనుకుంది పాము. అంతలోనే సందేహం! అయినా అవి సంతోషంగా ఉన్నాయి. తనెప్పుడూ అలా లేదు. ఎందుకనీ? ఎంత ఆలోచించినా పాముకి సందేహం తీరేది కాదు.

ఇంతలో నాగుల చవితి పండగొచ్చింది. ఊళ్ళోని మహిళలంతా పూలసజ్జలూ, పాలూపళ్ళు తీసుకుని పుట్ట దగ్గరికి చేరారు. పళ్ళు పప్పులు మరమరాలు పుట్టమీద, పాలు పుట్టలోనూ పోసి పూజలు చేసారు. పిట్టకీ, చేపకీ భలే హుషారు వచ్చింది. గాలికొచ్చి నీళ్ళల్లో పడిన మరమరాలని తింటూ చేప, పప్పులేరుకు తింటూ పిట్ట తెగ ఆనందించ సాగాయి.

పుట్టలోని పాముకి మీద పడుతున్న పాలతో లోపలంతా తడి తడిగా అయ్యింది. చిరాగ్గా ఉంది. బయటికి వద్దామంటే బయట కోలాహలంగా ఉంది. చివరికి భరించలేక మెల్లిగా బయటికొచ్చి, చరాలున పొదల్లోకి పాకింది.

ఇంతలో మనుషులు చూడనే చూశారు. కెవ్వుమంటూ వెనక్కి పరిగెత్తారు కొందరు. పొలాల్లో పని చేసుకుంటున్న కొందరు రైతు కూలీలు కర్రలతో పరుగెత్తుకు వచ్చారు. ''ఎక్కడ పాము?'' అంటూ కొట్టి చంపేందుకు సిద్ధపడ్డారు. మామూలు రోజుల్లో సరేగానీ, ఈ రోజు నాగుల చవితి. అంత పని చేయకండి అని కొందరనటంతో వెనక్కి తగ్గారు.



ఏదో పూజ అయ్యిందనిపించి అంతా అక్కడి నుండి వెళ్ళిపోయారు. అంతసేపూ పాముకి ప్రాణాలు పైనే పోయాయి. ఆ రోజు గడిచి పోయింది. ఇదంతా పాము మరిచిపోలేక పోయింది. తనని చూసి భయపడే మనుష్యులు, తనకి పూజలు చేసే మనుష్యులు, తననే చంప ప్రయత్నిస్తారు. ఎప్పుడెవరి కంట బడితే చావగొడతారో అన్నట్లు, ఎప్పుడూ నక్కి నక్కి బ్రతకాల్సిందే తను! చేప, పిట్ట ఎంత హాయిగా ఉన్నాయి? అనుకుంది.

ఇక లాభం లేదని, ఓ రోజు చేపని పిట్టని పేరుపెట్టి పిలిచింది. చేప ఒడ్డు దగ్గరికీ, పిట్ట క్రింది కొమ్మమీదికీ వచ్చి ఏమిటి? అన్నాయి.

పాము మీరు మనుష్యుల్ని చూసి భయపడతారు. అదే మనుషులు నన్ను చూసి

భయపడతారు. అయినా మీరు హాయిగా ఉన్నారు. నేను సంతోషంగా ఉండలేక పోతున్నాను. తేడా ఎక్కడుంది? అని అడిగింది.

దానికి పిట్ట రెక్కలల్లార్చుతూ "నువ్వు ఖస్సుబుస్సుమంటూ ఉంటావు. చరచరా పాకుతావు. నీ చర్మం తళతళా మెరుస్తుంది. మనుషులు నీకు పూజలు చేస్తారు. నువ్వు మాత్రం వాళ్ళని భయపెడతావు. ఒకోసారి కాటువేసి చంపుతావు. అదే గొప్పదనం అనుకుంటావు. అదే మేమయితే... చేప నీటిలో ఈదుతుంది. నేను గాలిలో ఎగురుతాను. మా వలన ఎవరికీ హాని లేదు. నేను నీలా బుస్సుమనలేను, చేపలా ఈదలేను. కానీ గాల్లో ఎగరగలను. నా గొప్పనాది. మీ గొప్పలు మీవి. మీలా నేనెందుకు లేను? అనుకుని, నేను ఎవ్వరినీ చూసి ఈర్ష్య పడను.

దేవుడు నాకిచ్చిన వాటిని ఆనందిస్తూ గడిపేస్తాను. నాకు ఇన్నిటినిచ్చిన దేవుడు కడుపునింపుకునేందుకు కొన్ని గింజలు కూడా ఇస్తాడు అనుకుంటే నాకు సంతోషంతో సంగీతం వచ్చేస్తుంది" అన్నది.

పాము చేప వైపు తలతిప్పి చూసింది. చేప తోక ఊపుతూ వయ్యారంగా కదిలి పిట్ట చెప్పిందే నా జవాబు కూడా అనేసింది.

కిలకిల్లాడుతూ పిట్ట గాల్లోకి, చేప నీట్లోకి నింపాదిగా వెళ్ళి పోయాయి. పాముకి ఉసూరు మనిపించింది. మౌనంగా పుట్టలోకి చేరి ముడుచుకు పడుకుంది. అందరూ తనని నాగ దేవతగా తలచి పూజిస్తున్నారని గర్వపడింది గానీ, తనని చూడగానే కర్రతో కొట్టి చంపబోతారని మరిచిపోయింది. అతిశయమే గుర్తుంది గానీ భయం గుర్తులేదు. స్వేచ్ఛగా పాడే పిట్టనీ, ఈదే చేపనీ చూసి అసూయపడింది తప్ప, తాను ఇతరులని కాటు వేసి కీడు చేస్తోందని గానీ, బుస్సుమంటూ భయపెడుతోందని గానీ పట్టించుకోలేదు. అందుకే పిట్టలాగా, చేపలాగా, తాను సంతోషంగా ఉండలేకపోయింది.

ఇవన్నీ ఆలోచించే కొద్దీ పాముకి విషయం బోధపడింది. తన్ను గురించిన జ్ఞానం తనకి కలిగింది. ఆనందంగా ఉండాలంటే కోపాన్ని, అసహనాన్ని, అహంకారాన్ని వదిలేయాలని అర్థమైంది. ఆచరణే మిగిలింది.



CHANDAMAMA (Telugu) July 2010 Registrar of Newspapers of India No.1114/57. Regd No. TN/CH(C)/216/09-11
Licensed to post WPP - Inland No.TN/CC(S)Dn/84/09-11, Foreign No. 85/09-11



# బుబ్బా జట్టు సాహసాలు




తేజా, నీలేష్‌లు మైదానంలో ఫుట్‌బాల్ మెలకువలు నేర్చుకుంటున్నారు. భుజంతో బంతిని డ్రిబిల్ చేయడాన్ని నేర్చుకోవడంపై దృష్టి పెట్టాడు తేజా.



నీలేష్ అతడికి సాయం చేస్తున్నాడు.

బంతి పడిపోతున్నప్పుడు నీ భుజాన్ని కూడా కాస్త దించాలి...



నీలేష్ కొద్దిగా గాల్లోకి ఎగిరాడు.




తేజా భుజంతో బంతిని గురిచూసి ఫ్లిక్ చేశాడు.



ఆటలో మునిగిన తన శిష్యులను చూసి కోచ్ మురిసిపోయాడు కాని, ఉన్నట్లుండి ఇబ్బందికరమైన విషయాన్ని తను గుర్తించాడు.




తేజా తన టీషర్ట్ చేతిమీది ప్యాచ్ కేసి చూపించాడు.




నీలేష్ తన టీషర్టు చేతిమీది ఫ్రాన్స్ ప్యాచ్‌ను చూపించాడు.




నీలేష్ బంతిని తీసుకుని వెళ్లిపోవడానికి అడుగేశాడు.

నువ్వు ఫ్రాన్స్‌ను బలపర్చడం ఎప్పుడు మొదలెడతావో నాకు చెప్పు. అప్పుడే మనం కోచింగ్‌ను కొనసాగిద్దాం.



